# హితోక్తి రత్నాకరము.



గ్రంథకర్త
వేదుల సత్యనారాయణ శాస్త్రి
ప్రధానాంధ్ర పండితుఁడు.



రావుబహాదూర్ కలవల కన్నన్ సెట్టి హైస్కూల్,
పెరంబూరు, మదరాసు.

**1931**

[illegible]ర సంయుతము] [వెల అ. 0-8-0

# కృతి సమర్పణము.



గృహాణ శ్రీవేంకటనాథ భక్త్యా
త్వత్పాదయో ర్మద్వినివేశితం భోః।
హితోక్తి రత్నాకర నామధేయం
శ్రీపారిజాతస్య సుమం ద్వితీయమ్॥

# దేవతా ప్రార్థనము.

క. ఇలవైకుంఠం బగు తిరు
మలనెలకొని భక్తజనుల ♦ మనిచెడు విభునే
నలుమేల్వేంకట నాథుం
దలతు న్మదిలోన నిష్ట ♦ దైవము నెపుడున్

## గురుప్రార్థనము.

సీ. ఆబాల్యమును విద్య ♦ నతి శ్రద్ధతో నేర్చి
గురులకు మోదంబు ♦ గూర్చె నెవండు
విద్యచేఁ ధనసాధు ♦ వృత్తంబుచే బంధు
తతిని లోకులను సం ♦ తసము పఱచె
సంతతంబును వశిష్టా ♦ నదీ స్నాన శి
ష్టాచార పూతాంత ♦ రాత్ముఁ డయ్యె
ఛాత్రకోటికి నెల్ల ♦ సదుపదేశములచే
సస్మితోక్తుల సంత ♦ సమును గూర్చె

తే. గీ. అల్పకాలములోనె ♦ యనల్పకీర్తి
కాయమును గాంచి మించెనే ♦ ఘనతరుండు
అట్టి సుగుణాలవాలుని ♦ నట్టి శిష్య
వత్సలుని నట్టి పండిత ♦ వరుని గురుని

క. అల్లంరాజు కులాంబుధి
సల్లలిత మృగాంకు రామ ♦ శాస్త్రి బుధవరున్
ఉల్లమున సంస్మరించెద
నెల్లప్డు తదంఘ్రి భక్తి ♦ నెనసిన కతనన్.

# ఉపోద్ఘాతము.

విష్ణుశర్మయను పండితుఁడు సంస్కృతమున పంచతంత్రమను నీతిశాస్త్రగ్రంథమును గథల రూపన రచించెను. అయ్యది కఠినశైలియగుటచేతను విస్తారమైన గ్రంథమగుటచేతను బాలుర పఠనోపయోగార్థమా గ్రంథములోని కొన్నికథలను స్వకల్పితములైన కొన్ని కథలను జేర్చి నారాయణ పండితుఁడను కవి హితోపదేశమను పేరుతో సంస్కృత భాషయందు సుహృల్లాభ సుహృద్భేద విగ్రహ సంధులను నాలుగు భాగములుగా రచించి చరితార్థుడయ్యె.

ఇటీవలి యాంధ్ర పండితులా హితోపదేశమును బంచతంత్రమును గూడ వచనరూపమునఁ గొందఱును బద్యరూపమునఁ గొందఱు నాంధ్రీకరించుచు వచ్చిరి. కాని వారు తమ యాంధ్రీకరణము సంస్కృతాభిజ్ఞుల యెడ సార్థకమను మాటను మఱచి దానిచేఁ దమ పాండిత్యప్రకర్షము వెల్లడించికొనిరి. అంతేకాని బాలుర యుపయోగమును గుర్తించి తదనుకూలమైన సులభశైలితో నిక్షుఖండముల వంటి హితోపదేశభాగముల నాంధ్రీకరింపరైరి. మఱియుఁ గథాప్రధానులై యనేకములగు నీతివాక్యములను విడిచివేసిరి. కథలను గూడ తాఱుమాఱుచేసిరి.

హితోపదేశమునందలి కథాప్రాశస్త్యమును గాంచియు నందలి రత్నముల బోలు హితవాక్యముల నీక్షించియు నద్దాని నాంధ్రంబున నా బాలవృద్ధపఠనార్హములగు వాక్యములతో రచియింపఁబూని యందలి నాలుగు భాగములను నా నేర్చుకొలందిని నాంధ్రీకరించి వానిలో మొదటి భాగములగు సుహృల్లాభ సుహృద్భేదముల నచ్చొత్తించి కృతార్థతఁ గాంచితిని. నా ప్రయాస మెంతవఱకు సఫలమో కనుఁగొను భారము పాఠకులది. తక్కిన విగ్రహ సంధులను రాఁబోవు వత్సరంబున నచ్చొత్తింపఁ గలవాఁడ.

నా ప్రథమ గ్రంథమగు చాణక్యుఁడను పుస్తకమును దమ పాఠశాలలలోఁ బాఠ్య గ్రంథముగా నియమించి ద్వితీయ గ్రంథ రచనకు నన్నుఁ బ్రోత్సహించిన యస్మన్మిత్రులగు పండిత సోదరుల కెల్లరకు నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడను.

ఇట్లు

గ్రంథకర్త.

# FOREWORD

Vedula Satyanarayana Sastrulu Garu, the Chief Telugu Pandit of the Calavala Cannan Chettiar's High School, Perambur, Madras, is already well-known to the Telugu world by his work entitled "Chanakyudu." He is an erudite Sanskrit and Telugu scholar; he has now brought out the first volume of Hitokthi Ratnakaramu which contains the two parts or divisions Suhrillabhamu and Suhrid-bhedamu. He has reserved Sandhi and Vigrahamu for the second volume, which is now under active preparation.

The author has digested the Sanskrit original and then given us the story in simple and chaste Telugu. The style of this book is vigorous and forcible without being pedantic. "Words of learned length and thundering sound" are conspicuous by their absence. The stories are such as to appeal to boys and girls in our schools. He has also introduced a few verses of his own, here and there, to point a moral.

The Hitopadesa contains the floating wisdom of India. The ancient Sanskrit writers hit at this novel method of giving us "beneficial counsel" by narrating what in English Rhetoric is called "Fable." A Fable is a story in which the actors are the lower animals with the actions, feelings and motives of men. That is why we find cats and jackals quoting the sacred Vedas

or discussing the principles of "*dharma*", like consummate scholars.

I can confidently recommend this book to all educationists in the Andhradesa who are in search of a lucid prose work written in a captivating style, free from errors. During my experience as a Teacher of Telugu for the past fifteen years I have found it very difficult to select suitable text-tooks for non-detailed study. As the market is flooded with books, good, bad and indifferent, the task of selection becomes very difficult.

Even a cursory glance at this book will convince the readers that it has certain merits, not possessed by certain other books in the field. This interesting book may be prescribed for non-detailed study, or for detailed study in the lower forms, according to the wishes of the teachers, who know perfectly well, the capacity of their students, to intelligently follow books written in a certain style. I sincerely trust that this book will have a long and useful career, for, the Hitopadesa is a book of perennial interest. It can never become stale : it can never become old or cold, but it will continue to be read as long as the human heart shall beat.

K. V. RADHAKRISHNA SHASTRI, B.A., L.T.,
*Lecturer in Telugu, Loyola College,*
*Cathedral Post, Madras.*

"MITAKSHARA"
VEPERY,
*25th Dec., 1931.*

శ్రీ గణేశాయనమః.

# హితోక్తి రత్నాకరము.

## సుహృల్లాభము

---

భాగీరథీ తీరమునందుఁ బాటలీపుత్రమను నగర మొండు గలదు. దాన సుదర్శనుఁడను రాజు రాజ్యపాలన మొనర్చుచుండెను. ఒకనాఁ డాతండు కొలువు దీరియుండి యా సభలోని యొక పండితునిచేఁ బ్రస్తావవశమునఁ జదువఁబడిన రెండుశ్లోకముల నాలకించెను. ''శాస్త్రము బహు సంశయము లను దీర్చును. పరోక్షార్థములను బ్రత్యక్షీ కరించును. కావున లోకుల కయ్యదియే నేత్రము. అది లేనివాఁడే యంధుఁడు.'' ''జవ్వనము, ధనసంపత్తి, ప్రభుత్వము, అవివేకము నను నీ నాలుగిఁటిలో నొక్కొక్కటియే సర్వానర్థమ్ములఁ బుట్టింప వలంతి యన నాలుగును జేరినఁ జెప్పవలయునే'' అని యా శ్లోకంబుల యర్థంబును గ్రహించి రాజు విద్యనేరక స్వేచ్ఛా విహారులై వర్తించు తన పుత్రులం దలంచికొని మనంబున నిట్లు చింతించె. విద్వాంసుఁడును ధార్మికుఁడును గాని పుత్రుఁ డున్న ఫలమేమి? గ్రుడ్డి కన్నువలనఁ జక్షుః పీడయే ఫలము గాని వేఱు లాభము గలదా? పుట్టనివాఁడు; చచ్చినవాఁడు; మూర్ఖుఁడు నను నీ ముర్వురిలో మొదటివా రిరువురును లాభ కారులు. వా రొక్క దుఃఖమునే కలుగఁజేయుచున్నవారు. కడపటివాఁ డెల్లకాలము బహువిధములగు కష్టములకుఁ

గారకుఁ డగుచున్నాఁడు. ఎవ్వనిచే వంశము ఖ్యాతిఁ గాంచునో వాఁడే పుత్రుఁ డనఁబడును. గుణవంతుల లెక్కించు కాలంబున నెవ్వని నామంబు ముందుగ లెక్కింపఁబడదో యట్టి వానిఁ గన్నతల్లికంటె గొడ్రా లుత్తమురాలు. గుణహీనులైన నూర్గురు పుత్రులకంటె గుణవంతుఁడైన పుత్రుఁ డొక్కఁడు మేలు. చంద్రుఁ డొక్కఁడే చీఁకటి నంతను నాశము సేయఁ గలుగుచున్నవాఁడు. నక్షత్రము లన్నియు నైన నట్లు సేయఁ జాలవు. పూర్వజన్మమునఁ బుణ్యక్షేత్రంబుల ఘోరతపం బొనరించిన పుణ్యాత్ములకు ధార్మికుండును బండితుండు నైన పుత్రుఁ డుద్భవించును. లోకమున నాదాయము, ఆరోగ్యము; ప్రియభాషిణియగు భార్యయు; పండితుఁడై వశవర్తియగు సుతుఁడు; అర్థకరమగు విద్య; అను నీ యాఱును మిక్కిలి దుర్లభములు. ఋణము సేసిన తండ్రియు; వ్యభిచారిణి యగు తల్లియు; అతి రూపవతియగు భార్యయు; అపండితుఁడగు పుత్రుఁడును; శత్రువులని పండితులు వచించుచున్నారు. అభ్యాసకాలమున విద్యయు; అజీర్ణకాలమున భోజనమును, దరిద్రునకు సభయు; వార్ధకమున యౌవనవతి యగు భార్యయు; విషతుల్యములు. కులహీనుఁడైనను గుణవంతుఁడు పూజింపఁబడుచున్నాఁడు. ధనుస్సు విశుద్ధ వంశసంజాతమైనను గుణహీనమయిన నేమి సేయఁ గలదు? ఓ పుత్రులారా! ఇంతకాలము గడచెను. ఇంచుకయైన విద్య నభ్యసింప రైతిరి గదా? కావున నే మీరు పంకమధ్య ప్రవిష్టమగు గోవువలెఁ జెడ నున్నారు. ఇపుడు

మిమ్ములను బండితులను జేయు నెట్లు. ఆహార నిద్రాభయ ములు సర్వ జంతువులకును సామాన్యములు. బుద్ధి యొక్కటియే మనుష్యునకు విశేషము. అయ్యది లేకుండినఁ బశువునకును మనుజునకును భేద మేమి ? ధర్మార్థ కామ మోక్షములలో నొక్కటియైన సంపాదింపని వాని జన్మ మజాగళస్తనమువలె నిరర్థకంబు. "ఆయువు; కర్మ; విత్తము; విద్య; మరణము నను నీ యైదింటిని దేవుఁడు జీవునకు గర్భమునఁ బ్రవేశింపఁగానే కల్పించుచున్నవాఁడు. అవశ్యముగఁ గావలయు నర్థము లెవ్వనికేనిఁ గాక మానవు. ఈశ్వరుండయ్యు సాంబశివుండు దిగంబరుండై భిక్షమున జీవింపఁడే" అను నీ న్యాయమును జింతించి యెవ్వరైనను రోగము వచ్చినప్పు డౌషధమును సేవింపక మానిరే ? దైవమునందే భారము నుంచి యే కార్యమునుగాని యుపేక్షింప రాదు. ప్రయత్నింపక నూవులనుండి నూనెఁ బొందఁగలమా ? యత్నముతోఁ గూడిన పురుషుని సంపదలు తమకుఁ దామే వచ్చి చేరును. తమ కార్యములు దైవమే సాధించు ననుమాట నీచుల వాక్యము. అదృష్ట మను మాటను విడిచి స్వపౌరుషమునందే యాధారపడవలయును.

యత్నము సేసినను సాధ్యముగాకున్న దోష మేమి ? ఒక్క చక్రముచేతనే రథ మెన్నఁడును నడువఁ జాలదు. అట్లే పురుషకారము లేక యదృష్ట ముండినను కార్యసిద్ధి కాఁజాలదు. పూర్వజన్మమునఁ దా నొనర్చిన సుకృతమునే బుధు లదృష్టమని చెప్పుచున్నారు. కావున నిస్సంశయ హృద

యుఁడై పురుషుఁడు పురుషకారమునే నమ్మవలయును. మృత్పిండముచేఁ గులాలుఁడే రూపము నిచ్ఛగించునో యా రూపును జేయుచున్నాఁడు. అట్లే మనుజుఁడు తన యదృష్ట మాధారముగఁ గైకొని కార్యమును సాధించుకొనవలయును. కాకతాళీయన్యాయమున సంప్రాప్తమై పురోభాగమున నున్న నిధినైన నదృష్టము చేతి కందీయఁజాలదు. దానిని గైకొనుట కైనను బురుషప్రయత్నము కావలయుఁ గదా ? సర్వ కార్యములు ప్రయత్నముననే సిద్ధించును. కాని మనో రథ మాత్రమున సిద్ధినొందవు. సింహము వేఁటాడిన మృగ ములు లభించును గాని నిద్రించుచున్న మృగములు తామే వచ్చి మమ్ము భక్షింపు మనునా ? తలిదండ్రులచే సుశిక్షి తుఁడై బాలుఁడు గుణవంతుఁ డగుచున్నాఁడు. కాని పుట్టిన తోడనే యెవ్వఁడును బండితుఁడు కానేరఁడు. ఎవ్వరిచే బాలుఁడు విద్య గఱపంబడఁడో యా తలిదండ్రులు వానికి శత్రువులు. రూపవంతుఁడైనను యౌవనవంతుఁడైనను సత్కుల సంజాతుఁడైనను విద్యాహీనుఁడు కింశుక పుష్పము చందమున శోభింపఁడు. మంచి వేషమును ధరించిన మూర్ఖుఁడు పలుక నంతవఱకు సభలలో శోభించును. అని చింతించి రాజు పండితుల నెల్లర నాహ్వానించి సభ యొనర్చి వారితో నిట్లనియె.

ఓ పండితోత్తములారా! నా వాక్యములను వినుఁడు. విద్యావిహీనులై స్వేచ్ఛావిహారములు సల్పు నాదుపుత్రులను నీతిశాస్త్రోపదేశము కావించి నీతికోవిదులను జేయఁజాలు

పండితుండు మీలో నొక్కఁడు గలఁడా? కాచము కాంచన సంసర్గమున మరకతపుఁగాంతిని బొందునట్లు మూర్ఖుఁడు సత్సహవాసముచేఁ దానును ప్రవీణుఁడగుచున్నాఁడు. అనిన వారిలోని వాఁడగు విష్ణుశర్మయను సకలశాస్త్ర ప్రవీణుఁడగు బ్రాహ్మణుండు లేచి యిట్లు విన్నవించెను.

దేవా! నీపుత్రులు మహా వంశసంభూతులు. కావున వారికి నీతి నేర్పుట సుకరము. గుణహీనమైన వస్తువుతోఁ జేసిన నేకార్యమును ఫలింపదు. ఎంతగఁ బ్రయత్నించినను జిలుకను వలెఁ గొంగను మాటలాడింపఁగలమా? మఱియు గుణవంతమైన కులంబున నిర్గుణుం డగుసుతుండు జనింపఁజాలఁడు. పద్మరాగములగనిలో గాజు పుట్టునా? కావున నాఱుమాసంబుల లోపల నీదుసుతులను నీతిశాస్త్రాభిజ్ఞులఁ గావించెదను. ఈ మాటను రాజు విని సవినయుఁడై తిరిగి పలికెను. కీటమైనను పుష్పసంసర్గమున మహాత్ములశిరము నధిష్ఠించుచున్నది. సజ్జనులచే దేవతాకారమును బొందింపఁబడిన శిలాఖండమును నమస్కరింపఁబడుచున్నది. సూర్యసాంగత్యమున నుదయాద్రియందలి ఱాళ్లన్నియుఁ బ్రకాశించుచున్నవి. అట్లే సజ్జనసహవాసమున హీనవర్ణుఁడును బ్రకాశింపఁగలఁడు. గుణవంతులను బొందినవారు గుణవంతు లగుచున్నారు. గుణహీనులను బొందినవారు తదనురూపమైన గుణమునే కాంచుచున్నారు. నదిలోఁబడిన కలుషజలము పానార్హ మగుచున్నది. సముద్రమునొందిన నిర్మలజలము పానానర్హమై చెడుచున్నది. కావున నా తనయులకు నీతిశాస్త్రోపదేశము సేయుభారము మీయది. అని

సకర్పూరతాంబూలము నొసంగి పుత్రులను సమర్పింప నా విష్ణుశర్మ రాజకుమారులను గైకొని యొకహర్మ్యపరిభాగం బునకుఁ దోడికొనిపోయి వారితో నిట్లనియె.

---

కథాప్రారంభము.

---

ఓ రాజపుత్రులారా! విద్యయే నరునకు రూపము. అయ్యదియె గుప్తమైనధనము. పరదేశమున బంధువు. అదియే గృహము. విద్యయేకీర్తికరి. విద్యయే నేత్రము. విద్యయే జీవాతువు. విద్యలేనివాఁడు పశువు. జలములేని ప్రదేశమును, విద్యనేరని కులమును, బిడ్డలులేని యాఁడుదియు; దక్షిణలేని యజ్ఞమును, నిరర్థకములని పెద్దలువచింతురు. కావ్యశాస్త్రవినోదమున బుద్ధిమంతులకుఁ గాలము సెల్లును. మూర్ఖులకు దుఃఖములచేఁగాని; నిద్రచేఁగాని; కలహము చేతఁగాని; కాలయాపన మగును. కావున మీకు వినోదార్థము కాకకూర్మమృగమూషికముల వినోదకథ చెప్పెదను. మఱియు సుహృద్భేద విగ్రహసంధులనంబడు మూఁడుకథలం బోధించెద వినుఁడనిన రాజపుత్రులు సావధానులమై యున్నారము చెప్ప వలయు ననుటయు విష్ణుశర్మ చెప్ప నారంభించెను.

గోదావరీతీరమున విశాలమగు శాల్మలీతరు వొండు కలదు. దానియందు నానాదేశాగతములగు పక్షులు రాత్రి వాసము సేయుచుండును. ఒకనాఁటిప్రాతఃకాలమున లఘుపత

నకుఁడను వాయసము మేలుకని చూచునప్పటికి యమ భటునిఁబోలు కిరాతుఁడొకఁడు కానవచ్చెను. కాకి మనసున "నేఁడుప్రొద్దుననే యీదుర్మార్గుని మోము చూచితిని. ఏమి కీడురానున్నదో యెఱుఁగను. వీఁ డున్నతావున నిలువరాదు. మఱి యెచ్చటికైన నేగదఁగాక" యని చింతించుచుండఁగా నావ్యాధుఁ డాప్రాంతమున నూకలుచల్లి వలపన్నిపోయి యొకమాటునఁ బొంచి యుండెను. అంత నావృక్షమున వసించుపావురము లన్నియు నాకసమున నెగురుచు నానూక లను గాంచెను. ఆపావురములకు రాజైన చిత్రగ్రీవుఁడను పావురము తోడికపోతములతో నిట్లనియె. ఈనిర్జనవనమందు నూకలు రా నిమిత్తమేమి? ఇయ్యది మన మాలోచింప వలయును. వీనిని భక్షింప నాశపడుట మనకు శుభోదర్క- ముగఁ దోఁచదు. అతిలోభమునఁ గార్యము సేయఁబూనిన వాఁడు కంకణమున కాశపడి వ్యాఘ్రముచేత భక్షింపఁబడిన పాంథునిచందమున వినాశమునొందును. మీకాకథఁ జెప్పె దను వినుండు.



పసిఁడికంకణమున కాశపడిన పాంథుని కథ

కం. అతిలోభమ్మునఁ గార్యము
సతతమ్మును జేయఁజూచు । జనుఁడుదు రాశా
యుతుఁడయి వలయమునకుఁ బులి
మతినమ్మిన పాంథుపగిది । మహినినశించుఁ.

నేనొకప్పు డరణ్యమున సంచరించుచుఁ జూచుచుంటిని.

ఒక ముసలిపులి స్నానముచేసి దర్భలను జేతఁబట్టుకొని యొక సరోవరతీరమునఁ గూర్చుండి యొకబాటసారిని జూచి యిట్లు చెప్పుచున్నది. "ఓపాంథుఁడా! ఇదిగో బంగారుకంకణము. దీనిఁ గైకొనుము." ఆమాటలను విని యాతెరువరి లోభాకృష్టుఁడై నాభాగ్యముచేతనే యిది లభించుచున్నది. దీనియం దాత్మహాని శంకింపరాదు. మనుష్యుఁడు సాహసింపక యేమేలును బొందఁజాలఁడు. ఎల్లపుడును సంశయించువాఁడు జీవించుటయెట్లు? అయినను జూచెదఁగాక! యని తలంచి "వ్యాఘ్రమా! కంకణమేదీ! చూపుము?" అనియెను. పుండరీకము హస్తమును ముందునకుఁ జాఁపి స్వర్ణకంకణ మాపాంథునకుఁ జూపెను. పాంథుఁడు క్రూరుఁడవగు నిన్ను నమ్ముటెట్లు? అనినఁ బులి "ఓరీ! పాంథుఁడా వినుము. పూర్వము యౌవనదశయందుఁ గ్రూరుఁడనై యనేకములగు గోవులను మనుజులను, వధించి యాపాపమున భార్యాపుత్రులను గోలుపోయితిని. బంధువులును గతించిరి. ఇపుడు నేనేకాకినై యున్నవాఁడను. ఒకమహాత్ముఁడిఁక నెన్నఁడు నట్టిహింస సేయరా దనియు దానధర్మంబులు సేయుమనియు నాకు బోధించెను. నాఁటినుండియు విరక్తుఁడనై సత్కార్యములు సేయుచున్నవాఁడను. వృద్ధుఁడను. నఖములు జీర్ణములయ్యెను. దంతము లూడినవి. నన్ను నమ్మవా? నీవు. యజ్ఞాధ్యయనదానములు తపస్సత్యములు ధృతిక్షమాలోభములు నను నెనిమిదియు మోక్షమునకు మార్గములు. మొదటినాల్గింటిని దాంభికులును సేవింతురుగాని కడమ

నాల్గింటిని ధర్మాత్ములుమాత్రమే గ్రహింతురు. నాకు లోభము లేకుండుటంబట్టియే స్వహస్తస్థితమగు స్వర్ణకంకణమును సహితము నీకొసంగందలంచి యున్నవాఁడను. పులులు మనుష్యులను భక్షించునన్న ప్రవాదము దుర్నివారము. ఏలయన లోకము గతానుగతికము. నేనును ధర్మశాస్త్రముల నధ్యయనము సేసితిని. మరు భూమియందు వర్షమువలె క్షుధార్తునకు భోజనము సంతోషావహము. దరిద్రునకు దానమిచ్చుట యత్యంతము ఫలదము. తన ప్రాణ మెట్టిదో పరుని ప్రాణము నట్టిదేయని తలంపవలయును. సాధువు లట్లు తలంతురు. పరస్త్రీలను దల్లులవలెను; బరద్రవ్యమును లోష్టముగను; సర్వభూతముల నాత్మసమానముగను; జూచువాఁడె పండితుఁడనఁబడు నని ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. నీవు దరిద్రుఁడవు కావున నీకీ పసిఁడి కంకణము నీయఁ దలంచితిని. దరిద్రునకే దానమీయవలయు నని మహాభారతమునఁ గూడఁ జెప్పఁబడి యున్నది. "ఓ కౌంతేయుఁడా! దరిద్రునకే దాన మొసంగుము. ధనవంతునకీయవలదు. రోగముగలవాని కౌషధముగాని యారోగ్యవంతునకేల? సత్కాలమునఁ బుణ్యక్షేత్రమునఁ బూర్వము తనకుపకారి గాని వాని కిచ్చునదే సాత్వికధర్మము." అని. కావున నీ సరోవరమున స్నాతుఁడవై యీకంకణమును గ్రహింపుము" అనిన నాపాంథుఁడు లోభమున దానిమాటలకు లోఁబడి యా సరస్సునందు స్నానము సేయబోయి మహాపంకమున దిగఁబడెను. అపుడు పులి చూచి "అయ్యయో!

పంకంబున దిగఁబడితివే! నిన్ను లేవనెత్తెద భయపడకుము'' అనుచు సమీపించి వానిం బట్టుకొనియె. అపుడు వాఁడిట్లు దుఃఖించె. "ధర్మశాస్త్రముగాని; నీతిశాస్త్రముగాని; వేదాధ్యయనముగాని; దురాత్ముని స్వభావమును మార్పఁజాలదు. ఈ వ్యాఘ్రమును విశ్వశించుట యను ననాలోచిత కార్యము నాచేతఁ జేయఁబడినది. నదులను, శస్త్రపాణులను, నఖాయుధులను, శృంగవంతములగు జంతువులను, స్త్రీలను, రాజులను, నమ్మరాదని నీతి కోవిదులు వచించుచున్నారు గదా? సర్వగుణములకంటె స్వభావము ముందుగఁ బరీక్షింపఁ దగినది. దైవయోగము చాలనపు డెట్టివాఁడైనను నాపదల నొంది తీఱును. సమస్త కల్మషధ్వంసకారియు, జ్యోతిర్మధ్యచారియు, గగన విహారియు నగు నమృతకరుఁడును దైవయోగమున రాహు ముఖంబునం బడుటలేదా? లలాట లిఖితము నపనయింప నేరితరము.'' ఇట్లు చింతించుచునే వ్యాఘ్రముచేతఁ జంపి భక్షింపంబడియె. కావున మనమీ నూకలకు లోఁబడరాదని చెప్పితిని. విచారింపని పని యెన్నఁడును జేయరాదు. జీర్ణమగు నాహారము; నేర్పరియైన సుతుఁడు; సుశిక్షితయైన యాఁడుది, సుసేవితుఁడగు నృపతియు, విచారించి చేసిన కార్యము, నివి యెంతకాలమునకైనను హానికరములు కాఁజాలవు.

అనిన నీమాటలు విని యొకకపోతము సదర్పముగ నిట్లనియె. ఆహా! యేమి యీమాటలు! ఒక సంశయము వచ్చినపుడు వృద్ధునిమాట వినవలయును. కావున నామాటను

వినుండు. భోజన విషయమునఁ గొఱమాలిన శంకలు పెట్టు కొనరాదు. సర్వకాలము సంశయముతోఁగూడి భోజనమును మానుకొనిన జీవించుట యెట్లు? ఈర్ష్యావంతుఁడు; ఘృణా; వంతుఁడు అసంతుష్టుఁడు; క్రోధనుఁడు; నిత్యశంకితుఁడు; పరభాగ్యోపజీవి; యను నీయార్గురు దుఃఖభాక్కులని నీతి విదులు వచించుచున్నారు. అన విని కపోతములన్నియు నేలపై వ్రాలెను.

పెక్కు శాస్త్రములు పఠించియుం బరసంశయమ్ములం దీర్పవలంతులయ్యు లోభాకృష్టచేతసులు పలుకష్టములకుఁ బాల్పడుచున్నారు గదా! లోభమువలనఁ గ్రోధము జనించును. దానివలననే కామము గలుగును. ఆలోభమే మోహమును బుట్టించును. కాన లోభమే సర్వపాపములకు మూలము. బంగారుమృగ మేయుగమునందును బుట్టియుండలేదుగదా? అట్టి దానిం గాంచి రామునంతవాఁడు మోహపడెను. సామాన్యముగాఁ గష్టములు రానున్నపుడు బుద్ధిమంతుల హృదయము సహితము లోభాకృష్ట మగుచున్నది.

పిమ్మటఁ గపోతము లన్నియు వలలోఁ దగులుకొని వృద్ధకపోతమును దూషింపసాగినవి. ఏకార్యమునకును ముందుగ సిద్ధము కారాదు. అట్లు పోయినవాఁడు కార్యము సిద్ధించెనేని యొకభాగమునకుమాత్ర మర్హుఁడగును. ఆ కార్యము చెడినచో దూషణమునకు సర్వమునకుఁ బాత్రుఁడగును. వానిదూషణములు విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. ఇది యితనిదోషము కాదు. ఆపదలు రానున్నపుడు హితవాక్యము సహితము కష్టములకుఁ గారణమగుచున్నది. ఆపదవచ్చినపుడు

విస్మయము కా పురుషలక్షణము. కావున నీవిషయమై ధైర్యముఁ బూని ప్రతీకార మాలోచింపవలయును. ఆపదయందు ధైర్యము, సంపదయందు శాంతము, సభయందు వాక్పాటవము, యుద్ధమున విక్రమము, కీర్తియం దనురక్తి; శాస్త్రమునం దాదరము కలిగియుండుట మహాత్ములకు లక్షణము. సంపదాపదలందు మోదఖేదములందక రణధీరుఁడగు సుపుత్రుని సదృష్టవంతురాలగు యువతి యొకతెయే కనంగలదు. అతినిద్ర, తొందర, భయక్రోధములు, జాగుసేయుట యను నీదుర్గుణములను మేలుకోరువాఁడు వీడవలయునని నీతి శాస్త్రజ్ఞులు వంచింతురు. ఇపుడు మన మీవల నెత్తికొని యాకాశమునకుఁ జనవలయును. అల్పులమగు మనకీ కార్యము సాధ్యమా యని తలంపరాదు. అల్పులయినను సంఘీభవించి యెంతటి కార్యమైన సాధింపఁగలరు. గడ్డిపరకలు సహితము త్రాడుగ నేర్పడి ద్విరదమును సహితము బంధించుటలేదా? అల్పుని నైనను దనవాని విడిచియుండరాదు. పొట్టూడిన మాత్రమునఁ దండులము లంకురింపఁ జాలకున్నవి. అనినం బక్షులన్నియు వలనెత్తికొని విచిత్రముగ గగనమార్గమున కెగిరెను. లఘుపతనకుఁడా పక్షులవృత్తాంతమును దెలియ వానివెంబడి నేగుచుండె. పక్షులువల నెత్తికొనిపోవుటచూచి వ్యాధుఁడు వెఱఁగుపడి ధనుస్సును జేతఁ బూని నేలపై ప్రాలఁగానే పోయిపట్టుకొని యెదఁగాక! యని వానిక్రిందుగ మోము పైకెత్తుకొని కొంతదూరము పోయి పక్షులు కనుచూపుమేర దాఁటిపోవఁగా నిరాశఁ జెంది మఱలి

పోయెను. అది చూచి పక్షులు చిత్రగ్రీవునితో నిట్లనియె. ఇపుడు మన మెచ్చటకుఁ బోవలయును? చిత్రగ్రీవుఁ డిట్లనియె. తల్లి దండ్రులు, మిత్రుఁడు నీమువ్వురు నెల్లకాలము హితులు. తక్కినవారు కార్యాపేక్షచే హితులై వర్తింతురు. నాకు హిరణ్యకుఁడను మూషికోత్తముఁడు హితుఁడు గలఁడు. ఆతఁడు గండకీనదీతీరమున విచిత్రవనమున వాసము చేయుచున్నాఁడు. ఆతని సమీపించిన దంతముల బలిమిచే నీ బంధములను ఛేదించి మనయాపదను బాపఁగలఁడు. అనినఁ బక్షులన్నియు సత్వరంబుగ హిరణ్యకుని కలుఁగు దాపున వ్రాలినవి. హిరణ్యకుఁ డపాయశంకచే శతద్వారంబగు వివరంబుఁ గావించుకొని యందు వాసము చేయుచుండెను. ఆతఁ డీ పక్షుల యలికిడి విని తన వివరముననే మెదలక యుండెను. అపుడు చిత్రగ్రీవుఁడు హిరణ్యకా! మాతోడ మాటలాడ వేమి ? అనియెను. హిరణ్యకుఁ డా మాట నాలించి యది తన మిత్రుఁడగు చిత్రగ్రీవునిదని కంఠస్వరమునుబట్టి యెఱింగి, సంభ్రమముతోడ లాఁగ వెడలివచ్చి "ఆహా! యెంత పుణ్యవంతుఁడను! నా ప్రాణమిత్రుఁడగు చిత్రగ్రీవుని నేఁడుచూడఁ గల్గితిని." అని పలుకుచు సమీపించి వాని పాదంబులం దగులుకొనియున్న వలను గాంచి విస్మితుఁడై క్షణకాలము మాటలాడకుండి "మిత్రుఁడా! ఏమియిది?" అని పలికెను. అదివిని చిత్రగ్రీవుఁడు చెలికాఁడా! మేము పూర్వజన్మమునఁ జేసికొనిన కర్మమునకు ఫలము. ప్రాణులకు రోగశోక పరితాప బంధన వ్యసనము లాత్మాపరాధ వృక్షము ఫల

ములు. అనిన విని హిరణ్యకుఁడు చిత్రగ్రీవుని బంధములం గొఱుక సత్వరంబుగ సమీపించె. చిత్రగ్రీవుఁడు మిత్రమా! వలదు. నా యాశ్రితులైన వీరి బంధములను ముందుగఁ ద్రెంపుము. పిదప నా బంధములను ఛేదింపవచ్చును. అనిన హిరణ్యకుఁడు "నే నల్పుఁడను. నా దంతములు మిక్కిలి సున్నితములు. కావున నిందఱి పాశంబులను ద్రెంపఁగలనా? నా దంతముల బలిమి కొలఁదిని ముందు నీ పాశములఁ ద్రెంచి పిదప శక్యమైన వీరి బంధముల ఖండింతు" ననినఁ జిత్రగ్రీవుఁడు "ముందు వీరిబంధములను ఛేదింపుము. పిమ్మట శక్తిగలిగిన నే నా కట్లు ద్రెంపవచ్చును" అనిన విని హిరణ్యకుఁ డిట్లనియె. తనను మానుకొని పరులను రక్షించుట నీతి గాదు. ఆపన్నివారణార్థము ధనముఁ గూర్పవలయును. ఆ ధనముచే భార్యను బోషింపవలయును. భార్యా ధనములచేఁ దన్ను రక్షించుకొనవలయును. ప్రాణమే ధర్మార్థ కామ మోక్షములకు సాధనము. అట్టి ప్రాణమును విడిన వాని కయ్యవి సర్వము నశించును. అనిన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. మిత్రుఁడా! నీవు చెప్పినది సత్యము. అయినను నా యాశ్రితుల దుఃఖమును జూచి యోర్వఁజాల కున్నవాఁడను. కావున నిట్లు పలుకుచుంటిని. ప్రాజ్ఞుఁడు సజ్జనుల నిమిత్తము ధన ప్రాణములనైనను వీడుట యుచితమని ధర్మజ్ఞులు వచింతురు. మఱియొక హేతువుకూడఁ గలదు. జాతి ద్రవ్య బలాదులచే వీరు నాకు సమానులు. వీరికి నా ప్రభుత్వమువలని ఫల మేమి? వీరు నన్ను జీత బత్యములు లేకయే యెల్లకాలము

సేవించుచున్నారు. కాన నా ప్రాణములు వీడియైన వీరిని రక్షింపవలదా ? మాంస మూత్ర పురీషాస్థి వినిర్మితమై విగర్హితమైన శరీరమును వీడియైనను శాశ్వతమైన యశమును సంపాదింపవలయును. అనిత్యమై మలినమైన శరీరము పోయినను శాశ్వతమై పరిశుద్ధమైన యశము లభించుటకంటె మేలుకలదా ? శరీరమునకును యశమునకును జాల తారతమ్యము గలదు. శరీరము క్షణ నశ్వరము. యశము శాశ్వతము. ఈమాటలను హిరణ్యకుఁడు విని సంతసించి మిత్రుఁడా! నీ యాశ్రిత వాత్సల్యముచేఁ ద్రిలోకాధిపత్యమున కర్హుఁడవై యున్నాఁడవని శ్లాఘించి యన్నిఁటి బంధములు ఛేదించి పరివారముతోడఁ జిత్రగ్రీవునకు విందొనర్చి సుఖముగ నున్నతఱి నాతనితో నిట్లనియె.

మిత్రుఁడా ! చిత్రగ్రీవుఁడా ! ఈ వలలోఁ దగులుకొంటినిగదా యని నీ యప్రాజ్ఞతకుఁ జింతింపకుము. ఏలయన కష్టకాలము సమీపించినపుడు నూఱుయోజనములు చూడ శక్తి కలదైనను బక్షి యురిత్రాళ్లను జూడఁజాలదు. చంద్రసూర్యులకు గ్రహపీడనమును, గజ భుజంగ విహంగములకు బంధనమును, బుద్ధిమంతులకు దారిద్ర్యమును, గాంచినపుడెల్ల విధియే బలవంతుఁడని తలంతును. ఆకాశపథమున సంచరించు పక్షులైనను సముద్రమధ్యమునఁ జరించు మత్స్యములైనను గాలము వచ్చినపుడు క్రూరులకుఁ బట్టువడుచున్నవి. కావున నియ్యది నీదు మతి విహీనత కాదు. దైవసంకల్పము. అని యూఱడింపఁ జిత్రగ్రీవుఁడా మూషికమునొద్ద సెలవుగైకొని

యథేచ్ఛం జనియె. కావున నెల్లరు నెందఱైనం గొందఱు స్నేహితులను సంపాదించుకొన వలయును. ఒక్క మూషికముతోడి మైత్రివలనఁ గపోతము లెంత లాభమును గాంచెనో చూడుఁడు.

పిమ్మట హిరణ్యకుఁడు తన వివరమును బ్రవేశించెను. అనంతరము లఘుపతనకుఁడు కపోత హిరణ్యకుల వృత్తాంతము నామూలాగ్రముగా వీక్షించి హిరణ్యకుని కలుఁగు దాపు చేరి; ఓ హిరణ్యకుఁడా! నీవు మిక్కిలి శ్లాఘ్యుఁడవు. నేనుగూడ నీతోడ మైత్రిని గోరుచున్నాను. నన్నుఁగూడ మిత్రభావముచే ననుగ్రహింపుము. అనిన విని హిరణ్యకుఁడు తన వివరమునం దుండియే యిట్లనియెను.

హిరణ్యకుఁడు:-నీ వెవ్వఁడవు? కాకము:-నా పేరు లఘుపతనకుఁడు. నే నొక వాయసమను. హిరణ్యా:-నీతోనా మైత్రి చేయవలయును? ఎవ్వనితో నేది చేయవలయునో విద్వాంసుఁడు వానితో నది చేయవలయును. నే నాహారమను. నీవు భుజించువాఁడవు. మన కిరువురకును స్నేహ మెట్లు కుదురును. భక్ష్యమునకు భక్షకునితోడి మైత్రి యాత్మహానికే హేతువగును.

మృగ కాక జంబుకముల కథ.

కం. మునుపొక మృగము సృగాల
మ్మునుగని మదినమ్మి దాని । మోసమునవలన్
వనరుచుఁగాకము చేతను
దన రఁగ రక్షింపఁబడియె । ధార్మికుఁడగుటన్.

నీ కా కథ చెప్పెదను వినుము.

మగధదేశమునఁ జంపకవతియను వనము కలదు. దానియందుఁ జాలకాలమునుండి మృగ కాకములు మిగుల చెలిమిగలిగి వాసము చేయుచుండెను. ఆమృగము స్వేచ్ఛగాఁ దిరుగుచు బలిసినదై యొకనాఁ డొక నక్కచేతఁ జూడఁబడెను. నక్క జింకనుజూచి "యేమీ! ఈ జింక యెంత పోతరించి యున్నది! దీనిని భక్షించిన బాగుగ నుండును. కానిమ్ము దీనికి విశ్వాసము పుట్టించెద" నని యాలోచించి మృగమును సమీపించి యి ట్లనియె. మిత్రమా! కుశలమా నీకు? మృగము:-నీవెవ్వఁడవు? నక్క:-నాపేరు క్షుద్రబుద్ధి. ఈ యరణ్యమునందు బంధుహీనుఁడనై మృతతుల్యుఁడనై వసించుచుంటిని. ఇపుడు మిత్రుఁడవైన నిన్నుఁ జూచి నా ప్రాణము వచ్చినట్లున్నది. నీతోడ వర్తించెదను. నాతో మైత్రిగలిగి యుండుము. అనిన మృగము సరి యని యా వంచకుని వెంటబెట్టుకొని సాయంకాలమునకుఁ దన నివాసమును జేరెను.

అచ్చటఁ జంపక వృక్షముపైఁ గూర్చుండిన మృగ మిత్రమగు కాకము వానిని జూచి యి ట్లనియె. మిత్రుఁడా! యీ రెండవ వాఁడెవ్వఁడు? మృగము:-ఈతఁడు జంబుకుండు నా మైత్రినిగోరి వచ్చినవాఁడు. కాకి:-మిత్రుఁడా! క్రొత్తగా వచ్చిన వారిని విశ్వసింపరాదు. కావున నీ వొనర్చినది శుభోదర్కము కాదు.

క. ఇలనెవ్వరికైనను దాఁ
గులశీలంబుల నెఱుంగ ♦ కుండఁగనిరవుఁ
లలినొసఁగరాదు గృధ్రం
బలమార్జారమును జేర్చి ♦ హానిఁగుడువదే.

అనిన మృగ మాకథ నాకుఁజెప్పు మనుటయుఁ గాక మిట్లు చెప్ప నారంభించెను.

జరద్గవ దీర్ఘ కర్ణముల కథ.

భాగీరథీతీరమున గృధ్రకూటమను గొప్ప పర్వతము కలదు. దానియందొక పెద్ద జువ్విచెట్టు కలదు. దాని తొఱ్ఱలో జరద్గవమను నొక ముసలిగ్రుడ్డి గ్రద్ద వాసము సేయుచుండెను. ఆ వృక్షముపై వాసముచేయు పక్షులన్నియు దానిని గాంచి జాలిపడి తాము తెచ్చుకొనిన యాహారములోఁ గొంచెము కొంచె మాగ్రద్ద కిచ్చుచుండును. అది దానిని భక్షించి పక్షులు మేఁత కేగినపుడు వాని పిల్లలకుఁ గాపుగా నుండును. ఇట్లుండ నొకనాఁడు దీర్ఘకర్ణమను పిల్లి యొకటి తటాలునఁ జెట్టుపై కెక్కెను. దానిని గాంచి పక్షి శావకములు భయపడి యార్తనాదములు సలుపఁజొచ్చినవి. అది విని గ్రుడ్డిగ్రద్ద "ఆ వచ్చు వారెవ్వరు" అని హెచ్చరించెను. పిల్లి తనలో; "అయ్యో చచ్చితిని. ఎవ్వరు లేరనుకొని వచ్చితిని. క్రూరమైన గ్రద్ద యిట వాసముచేయుచున్నది. కానిమ్ము! రానున్నభయమునకై బుద్ధిమంతుఁడు వెఱవవలయును. సమీపించిన భయమునకు ధైర్యముఁ బూని ప్రతీ

కారముఁ జింతింపవలయును. నేనిపుడు సన్నిహితుఁడ నగుటచేఁ బాఱిపోవ వీలు పడదు. కావున దీనికి విశ్వాసముఁ గలిగించుచు సమీపించెద'' నని యాలోచించి యించుక చేరి యిట్లనియె. ఆర్యా! నమస్కారము. గ్రద్ద:-ఎవ్వఁడవునీవు? పిల్లి:-నేను మార్జారమను. గ్రద్ద:-పో! శీఘ్రముగ నవ్వలకుఁ బొమ్ము. లేకున్న నిన్నుఁ జంపివేయుదును. పిల్లి:-ఆర్యా! ముందు నామాటవినుము. పిమ్మట వధ్యుఁడనైనచో వధింపుము? జాతిమాత్రమున వీఁడు పూజ్యుఁడనియు వీఁడు హన్యుఁడనియు నిశ్చయింపరాదు. గుణదోషములు విచారించి నిశ్చయింపవలయును. గ్రద్ద:-అట్లైన నిటకు నీ వేల వచ్చితివో చెప్పుము? పిల్లి:-నే నీగంగానదియందు నిత్యము స్నానము సేయుచు నామిషాహారమును బరిత్యజించి బ్రహ్మచారినై చాంద్రాయణవ్రత మాచరించుచున్నవాఁడను. మిమ్ములను ధర్మజ్ఞులనియు విశ్వాసపాత్రులనియు నెల్లపక్షులువచించుచుండ నాలకించితిని. అందువలన విద్యావయోవృద్ధులరగు మీవలన ధర్మములు వినవలయునని యాశించి వచ్చితిని. మీ రిట్టిధర్మాత్ములరు! వచ్చినతోడనే చంపఁజూచుచున్నారు. గృహస్థధర్మమా యిది? శత్రువునకైనను గృహమునకు వచ్చినవాని కాతిథ్యము చేయవలయును. తనను నఱుకవచ్చినవానికి సహితము వృక్షము ఛాయ నొసంగి యాదరించుటలేదా? ధనము లేకున్న మాటలచేతనైన నాతిథ్యము చేయవలయును. దర్భలు, భూమి, ఉదకము, సూనృతవాక్యము ననునివి యెల్లరకును ద్రవ్యాపేక్ష లేకయే యాతిథ్యమునకు లభించునుగదా?

బాలునికైనను దనయింటికి వచ్చిన వానికిఁ బూజచేయ వలయును. అభ్యాగతుఁ డెల్లరకును దేవుఁడు. సత్పురుషులు గుణవంతులందును గుణహీనులందును సమానప్రేమతో నుండుదురు. చంద్రుఁడు మాలపల్లెయందుమాత్రము వెన్నెలఁ గాయకున్నవాఁడా? బ్రాహ్మణుల కగ్ని గురువు. తక్కినవర్ణము లకు బ్రాహ్మణుఁడు గురువు. స్త్రీలకుఁ బతి గురువు. ఎల్లరకును నభ్యాగతుండు గురు వని ధర్మశాస్త్రములు బోధించు చున్నవి. ఎవ్వనిగృహమునుండి యతిథి భగ్నాశుఁడై పోవునో యాగృహస్థుని సుకృతమంతయు నాయతిథి గ్రహించి తన దుష్కృతము నాగృహయజమానుని కిచ్చివేయు నని యుప నిషత్తులు వచించుచున్నవి. తనయింటికి వచ్చినపుడు నీచునైన నుత్తముఁడు పూజింపవలయును. అతిథి యనఁగా సర్వదేవమ యుఁడు. అనిన గ్రద్ధ యిట్లనియె. పిల్లులకు మాంసమన్న రుచి యెక్కువ. నాపక్షిపిల్ల లిచ్చట వాసము చేయుచున్నవి. అం దుచే నట్లు పలికితిని. పిల్లి యామాటనువిని, చెవులు మూసి కొని, కృష్ణ! కృష్ణ! ఎంత మాటాడితిరి! ధర్మ శాస్త్రములు వినుచు వీతరాగుఁడనై దుష్కరమగు చాంద్రాయణ వ్రతము సేయుచున్న వాఁడ. పరస్పర విరుద్ధములగు ధర్మ శాస్త్రములు సహితము హింస కూడదను విషయమున నైకమత్యము కలిగి యున్నవి. ఎవ్వరిని హింసింపక పరు లొనర్చిన హాని సహించి యెల్లరకును శరణు నొసంగు పుణ్యాత్ములు స్వర్గము నొందు వారని ధర్మ శాస్త్రములు కలవు గదా? తాను జేసి కొనిన ధర్మ మొకటియే తన వెంట వచ్చుననియు, తనకు

మరణ మన్న నెంత భయమో యితరములగు జంతువులకు నంత భయముండును గదా యనియుఁ జింతించినచో హింస కెవ్వఁడు పాల్పడఁ గలఁడు? స్వేచ్ఛగా వనమున మొలచిన యే శాకముచేత నయినను క్షుద్బాధఁ దీర్చికొన వచ్చును. ఈ దిక్కుమాలిన కడుపునకై యిట్టి ఘోరపాతక మెవ్వఁడా చరించును. అనిన గ్రద్ధ దాని మాటలు నమ్మి యిప్పటి నుండియు నీవు నా గృహమునకు రావచ్చును. పో వచ్చును. వలసినచో వసింప వచ్చును ఇఁక నీ కొక యాటంకము లేదు. అని చెప్పగా సంతసించి పిల్లి యా గ్రద్ధతో సఖ్యము చేయుచు నచ్చటనే వాసము చేయుచుండెను. పిమ్మట పిల్లి పక్షి పిల్లలను బట్టుకొని గొంతుఁ గొఱికి తెచ్చి తొఱ్ఱలోఁ బెట్టుకొని భుజింప సాగెను. పక్షులు తమ పిల్లలను గానక దుఃఖించి యిటునటు వెదుక నారంభించినవి. అది యెఱింగి మార్జాలము కోటరము నుండి యుఱికి పాఱి పోయెను. పక్షు లెల్లచోటుల వెదకుచుఁ దరుకోటరమునఁ దమ శిశువుల యెముకలను గాంచి యీ గ్రద్ధయే తమ పిల్లలను భక్షించె నని నిశ్చయించి యా ముసలి గ్రద్ధను ముక్కులతోఁ బొడిచియు గోళ్లతోఁ జీఱియుఁ జంపి వేసినవి. కావునఁ గ్రొత్తవారికి గుణము తెలియక నమ్మి తావీయరాదని నుడివితిని. అనిన విని కోపముతో నక్క మృగమునకు నీవు సహితము ప్రథమదర్శనదినమందుఁ గ్రొత్తవాఁడవే. రాను రాను మీ యిరువురకును స్నేహమెట్లు వర్ధిల్లుచున్నది. విద్వాంసుఁడు లేనిచోట నల్పబుద్ధియు

సమ్మాన్యుఁడు. వృక్ష హీనమైన దేశమున హేరండ వృక్షము మహా భూరుహముగ భావింపఁబడుటలేదా? వీఁడు నావాఁడనియు వాఁడు పరుఁడనియుఁ దలంపు లఘుబుద్ధులకు. ఉదారహృదయులకు లోకమే కుటుంబము. నాకీమృగము నట్లు నీవును మిత్రుఁడవుకావా? అనిన మృగ మిట్లనియె. మనలోమన కీవాదు లేల? అందరమును మైత్రితో నుండినం బోవునుగదా? ఒకనికొకఁడు మిత్రుఁడనియు, ఒకనికొకఁడు శత్రువనియు జన్మముచేతనే సంభవింపదు. వ్యవహారమును బట్టి మిత్రామిత్రులు గలుగుచున్నారు. అనినఁ గాకము సరి యట్లేకానిం డనియె. అదిమొదలు వారుమువ్వురు మైత్రి గలిగి యచ్చటనే వాసముచేయుచుండిరి. పిమ్మట నొకనాఁడు సృగాలము మృగమునుగాంచి రహస్యంబుగా నిట్లనియె. మిత్రుఁడా! యీవనంబున సస్యసంపూర్ణమైన క్షేత్రమొకటి కలదు. నీకాపొలమును జూపెదను. అని యామృగమును వెంటఁబెట్టుకొనిపోయి యాక్షేత్రమును జూపెను. మృగము ప్రతిదిన మాక్షేత్రమునకేగి సస్యమును భక్షించుచుండెను. అదిమెటెంగి యాపొలముకాపరి యురిపన్నిపోయెను. మృగము యథాపూర్వకముగ సస్యభక్షణముచేయుచు నాయురిలోఁ దగులుకొని "ఆహా! కాలపాశముంబోలు నీపాశమునుండి నన్ను రక్షించువాఁడెవఁడు నామిత్రుఁడు జంబుకుండు వచ్చె నేని నన్నుఁ గాపాడఁగలఁడు" అని విచారించు చుండె. అంతలో నక్క వచ్చి చూచి నాయాశ నేఁటికి ఫలించెను. పొలముకాఁపు నేఁడు దీనిని జంపక మానఁడు. దీనిమాంస

మును వాఁడు గ్రక్కొనిపోయినను రక్తసిక్తములగు నెమ్ము లైన నాకు లభింపకమానవు. అని చింతించుచుండె. ఇంతలో మృగము దానినిజూచి మిత్రుఁడా! వచ్చితివా! రమ్ము. శీఘ్రముగా నాబంధంబులం గొఱికి నన్ను రక్షింపుము. ఆపద యందు మిత్రునిగుణము, యుద్ధమున శూరునిగుణము, దరిద్ర మున భార్యగుణము, కష్టకాలములందు బంధువులగుణము పరీక్షింపవలయునని యనుభవశాలులు వచింతురు. కష్టసుఖ ములం దెవ్వఁడు విడువకుండునో వాఁడె బంధువు. అనిన నక్క దగ్గఱకువచ్చి పాశములఁ గాంచి తనలో "పాశములు కడుదృఢముగా నున్నవి. ఈ జింక త్రెంచుకొనఁజాలదని" చింతించి మిత్రుఁడా! యీపాశములు చర్మముతోఁ జేయఁ బడినవి. నేఁడు భానువాసరము. వీనిని నేను బండ్లతోఁ దాఁకు టెట్లు? నీవు మనంబున మఱియొకలాగునఁ దలంపకుము. తెల్లవారిన తరువాత నీ వెట్లుచెప్పిన నట్లొనర్చెదను. అనిచెప్పి వెడలిపోయి యాసమీపమున నె యొక పొదమాటున దాఁగి యుండెను.

అనంతరము వాయసము ప్రదోషకాలమునకు మృ గము నివాసమునకురాకుండుటంజూచి యావనంబెల్లఁ గలయం గాంచుచు వచ్చి యావిధముననున్న మృగమును జూచి సఖా! యిదియేమి? అనెను. అందుకు మృగము మిత్రవాక్యము విన కుండుటకు ఫలమియ్యది. ఆపద సమీపించినవారికి మిత్రుల వాక్యము విన బుద్ధిపొడమదు. మిత్రుఁడును శత్రువుగఁ దోఁచు ను. అనినఁ గాకము "ఆవంచకుఁడేడి" యనెను. మృగము

"నామాంసమును దినఁగోరి యిచ్చటనే యెచ్చటనో దాఁగి యున్నవాఁడు" అని ప్రత్యుత్తరమిచ్చెను. కాకము:- నేను ముందుగనే చెప్పియుండలేదా ! నావలన దోషము లేదుకావున నన్నెవ్వరు హింసింపరని నమ్మియుండరాదు. దుర్మార్గులవలన సజ్జనులకు సహితము భయము కలదు. ఆయువు చెల్లినవారు దీపమార్పినవాసన నాఘ్రాణింపఁజాలరు. సుహృద్వాక్యమును వినరు. అరుంధతినిఁ గనఁజాలరు. ముందిచ్చకములాడి పరోక్షమునఁ గార్యహానిఁజేయు పయోముఖ విషకుంభమువంటి దుర్మిత్రుని సర్వవిధముల వర్జింపవలయును. అనినఁ గాకంబు నిట్టూర్పుఁ బుచ్చి "ఓరి వంచకా! యెంతపనిచేసితివి? విశ్వాసించినవానినా మోసముచేయవలయును? దుర్జనునితోడ స్నేహ వైరములు చేయరాదు. చూడుము ! బొగ్గును దపింపఁజేసిన నయ్యది యగ్నిఖండమై హస్తమును గాల్చుచున్నది. పోనిమ్మని జలముఁజల్లినచో నల్లనై హస్తమును మలినముచేయుచున్నది. ప్రియవాదియైనంత మాత్రమున దుర్జనుని నమ్మరాదు. మాటలందుఁ దేనెయుండుటయు హృదయమున విషముండుటయు దుర్మార్గులకు సహజము. అనిచింతించుచుండఁగాఁ దెల్లవారెను.

పిమ్మట క్షేత్రపాలకుఁడు దృఢమైన దండమును జేతఁ బూని యచటికి వచ్చుచుండెను. అది గాంచి కాకము చెలికాఁడా ! నీవు చచ్చిన వానివలె గాలిచేఁ గడుపుఁ బూరించుకొని గ్రుడ్లు దేలవైచి యుండుము. నేను నీపైఁ గూర్చుండి కనులు పొడుచు వానివలె నటింతును. నేను కూయఁగానే

లేచి పాఱిపొమ్ము. అని చెప్పెను. కాకి చెప్పినట్లు మృగము పడియుండెను. అంత క్షేత్రపతి సమీపించి చూచి మృగము చచ్చి పడియున్నదని తలంచి యురి దాని కంఠమునుండి తొలఁగించి యారజ్జువును జక్కఁ జేసికొను చుండెను. అంతలోఁ గాకి కూయగా విని మృగము లేచి పాఱిపోయెను. మృగము తనను వంచించిన దని కోపించి క్షేత్రస్వామి దాని పైఁ దన చేతికట్టను విసరి వేయఁగా నది యా సమీపమున బొంచి చూచుచున్న గోమాయువునకుఁ దగిలి యది హత మయ్యెను. మూఁడు సంవత్సరములకుఁ గాని, మూఁడు నెలలకు గాని, మూఁడు పక్షములకుఁ గాని, మూఁడు వారములకు గాని, మూఁడు దినములకుఁ గాని లోపలనే పాపఫల మనుభవము నకు వచ్చునని ధర్మ శాస్త్రములు వచించుట లేదా!

కావున భక్ష్యమయిన నాకును భక్షకుఁడవగు నీకును బ్రీతి సరిపడదని చెప్పితిని. అనఁగా లఘుపతనక మి ట్లనియె. నిన్నుఁ భక్షించిన మాత్రమున నా కడుపు నిండఁబోదు. నీవు జీవించి యున్నచోఁ జిత్రగ్రీవునివలె నేనును శాశ్వతమగు సుఖమును బొందెదను. సు స్వభావ వంతములగు తిర్యగ్జంతువులు సహితము విశ్వాస పాత్రము లగుచున్నవి. సాధు శీలు రగు సజ్జనులస్వభావము మఱలింపరాదు. సాధువులను గోపింపఁ జేసినను సువిశాలమగు వారిమనసు వికారము నొందదు. కొఱవి చూపిన మాత్రమున సముద్ర ముష్ణమగునా? అనిన హిరణ్యకుం డి ట్లనియె,

నీవు చపలుఁడవు. చపలునితో స్నేహ మెన్నఁటికిని

జేయరాదు. మార్జాలము, మహిషము, మేషము, కాకము, కాపురుషుఁడు నను నీ యైదుగురు విశ్వసించిన వారికే కీడు సేయుదురు. నీవు వారిలోఁ జేరినవాఁడవు. అదియునుం గాక నీవు మాకు శత్రుపక్షము వాఁడవు. మైత్రిఁ జూపుచుండినను శత్రునితో సహవాసము చేయరాదు. అగ్నివలన నుష్ణగుణముఁ గైకొనియు జలము దాని నార్పుట లేదా? విద్యగల వాఁడైనను దుర్జనుఁడు పరిహార్యుఁడు. మణిని ధరించిన మాత్రమున సర్పము భయంకరము కాదా? శక్యమగు కార్యమును సాధింపవచ్చును గాని, అశక్య మెన్నఁటికి నశక్యమే. జలమున బండ్లును నేలపై నోడలు నడచునా? శత్రువులను, విరక్తయగు భార్యను, నమ్ముట తన ప్రాణహానికే హేతువగును.

అనిన లఘుపతనకుఁడు నీ యాడినదంతయు వింటిని, కాని నీతోడ స్నేహము చేయవలయునని నా దృఢనిశ్చయము. అందుకు నీ వంగీకరింపనిచోఁ బ్రాయోపవేశముసేసి ప్రాణములు త్యజింతును. దుర్జనుఁడు మృద్ఘటమునవలె సుఖభేద్యుఁడై దుస్సంధేయుఁ డగుచున్నాఁడు. సుజనుఁడు కనకఘటమువలె దుర్భేద్యుఁడై సుసంధేయుఁ డగుచున్నాఁడు. సజ్జనుఁడు నారికేళఫలమువలె బహిఃకాఠిన్యము గలవాఁడయ్యు హృదయమార్దవము గలిగి యుండును. దుర్జనుఁడు బదరీఫలముచందమునఁ బైకి మనోహరుఁడయ్యు నంతఃకార్కశ్యము గలిగి యుండును. సాధువులగువారికి స్నేహము భంగమైనను బరస్పరానురాగము నశింపదు. మృణాళము భంగమైనను దంతువు లనుబంధమును వీడుట లేదు. శుచిత్వము,

త్యాగిత, శౌర్యము, దాక్షిణ్యము, అనురక్తి, సత్యము, మొద లగునవి సుహృద్గుణములు. ఇట్టి గుణములుగలవాఁడవు నీ వొక్కఁడవుదక్క మఱియెవ్వఁడును నాకు లభింపఁడు.

అనిన వానిమాటలను విని హిరణ్యకుఁడు లోఁగ వెడలి వచ్చి యిట్లనియె. నీ సల్లాపములచేఁ దృప్తినొందితి. వర్ష కాలము, శీతజలస్నానము, ముక్తావళి, చందనము మొదలు గాఁగల శీతలవస్తువులు కూడ సజ్జనసల్లాపమువలె మనస్సుఖము నొసంగఁజాలవు. రహస్యభేదనము, యాచన, చలచిత్తత క్రోధము, అనృతము, ద్యూతము, అను నీయాఱును స్నేహ మునకు వినాశకములు. వీనిలో నొక్కటియు మాటలంబట్టి నీయందగుపడదు. పటుత్వ సత్యవాదిత్వములు మాటల చేతనే తెలియఁబడును. త్యాగితయు నచాపల్యముఁ బ్రత్యక్ష ముగాఁ జూచినంగాని తెలియఁబడవు సజ్జనులతోడి స్నేహము వేఱువిధము. దుర్జనుల తోడిమైత్రి వేఱువిధము. సజ్జనులకు మనోవాక్కాయములకు లక్ష్య మొకటియై యుండును. దుర్జ నుల కయ్యది భిన్నమై యుండును. కావున నీ యభీష్టమే కానిమ్ము. అని యాతనితోఁ జెలిమిచేసి వాయసమునకు భోజ నాదులచే సంతోషముఁ గలిగించి హిరణ్యకుఁడు తనవివర మును బ్రవేశించెను. అదిమొదలు వారిరువురకు స్నేహ మభి వృద్ధిఁ జెందుచుండెను.

ఒకప్పుడు లఘుపతనకుఁడు మిత్రుఁడా! హిరణ్యకా! నా కిచ్చట నాహారము కష్టతరలభ్యముగా నున్నది. కావున మఱియొకచోటునకుఁ బోఁదలంచితిని. నీవేమనియెదవు? అనిన

హిరణ్యకుఁడు కేశములు దంతములు స్థానభ్రంశముఁ బొంది నరాణింపనట్లు స్వస్థానము వీడిన నెల్లరును నవమానము నొందుదురు. కావున బుద్ధిమంతుఁడు స్వస్థానమును వీడ రాదు. అనిన లఘుపతనకుఁడు. మిత్రుఁడా! నీవుచెప్పినది నీచులవిషయము. సింహములు, సత్పురుషులు, నేనుఁగులు స్వస్థానమును వీడి చరించినను గౌరవపాత్రులు కాకుండిరా? కాక కాపురుష మృగములు నివాసమును వీడక గౌర వార్హము లగుచున్నవా? అనిన హిరణ్యకుఁడిట్లనియె. వయస్యా! నీ విపు డెట కేగవలయునని తలంచియున్నవాఁడవు? బుద్ధిమంతుఁడు ముందుపాదమును మోపి వెనుకపాదము నెత్తుచున్నాఁడుగదా? అని యడిగిన వాయసము నేనొకస్థానము నిరూపించికొంటిని. దండకారణ్యమునఁ గర్పూరగౌరమను సరస్సు గలదు. అచ్చట మంథరుఁ డను కూర్మరాజు నాకు స్నేహితుఁడు గలఁడు. అతఁడు మిక్కిలి ధర్మాత్ముఁడు. నన్ను మత్స్యాద్యాహార దానముచేఁ బోషింపఁగలఁడు. అనిచెప్పిన హిరణ్యకుండు సరి యట్లైనచో నాకుమాత్ర మిచట నేమి పని? ఏదేశమున గౌరవము, జీవనము, బంధువులు, మిత్రులు, విద్యాగమము, లేకుండునో యాదేశమున వాసము మానవల యునని నీతికోవిదులు వచింతురు. మఱియు గురువు, శ్రోత్రియుఁడు, వైద్యుఁడు, రాజు, లేనిదేశమునఁగూడ వసింపరాదు. కావున నన్నుఁ గూడ నీవెంబడిని గొనిపొమ్ము. అనిన వాయస మాతని వెంటఁబెట్టుకొని మంథరుని సమీపమునకుఁ బోయెను.

మంథరుఁడు దూరమున వీరినిఁ గాంచి యెదురేగి తీసికొని వచ్చి యాతిథ్య మొసంగెను. అపుడు లఘుపతనకుఁడు మంథరునితో నిట్లనియె. సఖా! ఈతని నెఱుంగుదువా? చాల బుద్ధిమంతుఁడు ఈతని గుణములను వర్ణింప శేషుఁడైనను వలంతి గాఁడన నతిశయోక్తి కాదు ఈతఁడు నిర్జనవనమున వసించుచుండ నాకు మిత్రుఁడయ్యె. అని చెప్పిన మంథరుఁడు హిరణ్యకా! నీవు జనశూన్యమగు వనమున వాసము చేయుటకు హేతువేమి? అని యడుగుటయు హిరణ్యకుం డిట్లనియె.

చంపకవతి యను నగరమున నొక మఠము కలదు. అచ్చటఁ జూడాకర్ణుఁడను భిక్షువు వాసము చేయుచుండెను. అతఁడు భుక్తావశిష్టమగు భిక్షాన్నమును పాత్రమున నుంచి చిలుక కొయ్యపైఁ బెట్టును. నేను బ్రతిదిన మాయన్నమును దానిపై కెగిరి భక్షించుచుంటిని. ఇట్లుండఁ జూడాకర్ణుఁడు వీణాకర్ణుఁడను పరివ్రాజకునితో మాటలాడుచుఁ బాత్రములోని యన్నమును భుజించుచుండిన నన్ను దన యోగదండముతో నేలపైఁ దట్టి వెఱపించుచుండెను. అది చూచి వీణాకర్ణుఁ డదియేమనఁ జూడాకర్ణుఁడు నాయన్నము నొక మూషికము ప్రతిదినము భక్షించి పోవుచున్నది. దీని యుపద్రవము నాకు మిక్కుటముగ నున్నది. అనిన వీణాకర్ణుఁడు చిలుక కొయ్యవైపు చూచి, ఆహా! ఇంత యెత్తున కెగురు సామర్థ్యము కలుగుట కీయెలుక కేమైన నొక హేతు వుండవలయును. పూర్వ మొక సంగలివాఁడు దీనివలెనే చాలదూర మెగురుచుండెడివాఁడు. నీకు వానికథ చెప్పెదను వినుము.

దర్పితునికథ.

పూర్వము కౌశాంబియను పురమున దర్పితుండను మంగలి వాసము చేయుచుండెడివాఁడు. వాఁడు ప్రతిదినము నార్జించిన విత్తము వెచ్చింపక లోభియై దానిచే స్వర్ణమును గొని దానిని కోడిగ్రుడ్డువలెఁ జేయించి యా స్వర్ణమయ పిండము నొక గుడ్డ పీలికను జుట్టి తన పొదియందు జాగ్రతగ దాఁచికొని యుండెను. పిదప వాఁడు ధనగర్వముచే బలిసి మిక్కిలి హెచ్చరికతో నుండెడివాఁడు. కృష్ణాష్టమినాఁడు వేడుకకై యాయూరివారు కట్టిన యుట్టులను పురుషద్వయప రిమితముగఁ బైకిలంఘించి యందుకొనువాఁడు. అది ధనబల మని తెలియక వాని సత్త్వోత్సాహములకు నే నాశ్చర్యము పడుచుండువాఁడను. వాఁడు మాటల సందర్భము వచ్చినపు డెల్ల "కోడిగ్రుడ్డంత బంగారము లేనివాఁ డుండునా?" యను చుండువాఁడు. ఆమాట కర్థ మొకతస్కరుఁడు గ్రహించి వెనుక పాటుననుండి వాని పొదిలోని యా బంగారపు టుండను నెమ్మదిగ సంగ్రహించి పోయెను. ఇకఁ జెప్పవలసిన దేమున్నది. మంగలికి నిద్ర లేదు. హారము లేదు. చిక్కిశల్యా వశిష్టుఁడయ్యెను. ఎక్కడఁ జూచినను నిదియే గోల. అంత నుండి యొక్క గజమైనను మీఁది కెగురలేక పోయెడు వాఁడు. పూర్వము వానిబలమునకును, అనంతరము వాని బలహీనతకును వాఁడు సంపాదించిన యా కుక్కుటాండ మంత బంగారమే హేతువుగదా యని నేను గ్రహించితిని. కావున నొక యాశ్చర్యమైన కార్యము జరుగునపుడు తగిన

హేతు వుండక పోదు. ఈయెలుక కింతయుపద్రవము సేయుటకు జాలినంతబల ముండుటకుఁ దగిన కారణముండును. అనినఁ జూడాకర్ణుఁడు దీనిబలమునకు బహుధనార్జనమే హేతువై యుండవచ్చును. ఎల్లకాలము నెల్లరకును ధనమే బలమునకు మూలము. ధనము కలిగినమాత్రముననే పంచముడును రా జగుచున్నాఁడు. అని తలఁచి గడ్డపారతో నావివరమును ద్రవ్వి చిరకాలార్జితమైన నా యావద్విత్తమును హరించెను. పిమ్మట శక్తిహీనుఁడనై సతోత్సాహము లుడిగి యాహారమునైన సంపాదించికొనఁ జాలక భయపడుచు నెమ్మది నెమ్మదిగఁ బ్రాకుచుండఁ జూడాకర్ణుఁడు నన్నుఁ గాంచి "అర్థముననే యెల్లరును బలవంతులు. అర్థముననే పండితులు. అర్థములేనివాని సర్వకార్యములు చెడును. ఈమూషికము ధనముపోయినమాత్రముననే స్వజాతిసామ్యమును బొందినది. ధనముగలవానికే మిత్రులును బంధువులును గలుగుదురు. అతఁడే పురుషుఁడు. వాఁడే పండితుఁడు. పుత్రులు మిత్రులు లేనివాని గృహము శూన్యము. మూర్ఖునకు హృదయము శూన్యము. దరిద్రునకు సర్వము శూన్యము. దారిద్ర్యముకంటె మరణము మేలు. మరణ మల్పక్లేశము. దారిద్ర్యము మహాదుఃఖకరము. ఇంద్రియములు, నామము, బుద్ధి, మాట, లొంటివేయయ్యు నర్థరూపమైన ప్రాణము గతించిన మాత్రమునఁ బురుషుఁడు క్రొత్తవాఁడగుచున్నాఁడు." అని యధిక్షేపించెను. అది విని యిఁక నిచట నివాసము చేయఁదగదు. అర్థనాశము, మనస్తాపము, గృహమునందలి దుశ్చరితము,

వంచనము, అవమానము, ప్రకాశింపఁజేయరాదు. కావున నాకుఁ గలిగిన యీ యర్థనాశము నెవ్వరికిని దెలుపరాదు. అదృష్టము వ్యతిరేకమై పౌరుషము వ్యర్థమైనపుడు మానవునకు వనవాసముకంటె సుఖములేదు. మానవంతుఁడు మరణమైన నంగీకరించును గాని దైన్యము నొందఁడు. చూడుము! అగ్ని యారిపోవునుగాని శీతలత్వమును గాంచదు. పూలగుత్తికింబోలె మానవంతునకు రెండేస్థానములు. సర్వజనుల మూర్ధములందైన వాసముచేయును. లేక వనమునందైనను నశించును. కావున నిచ్చటనే వాసముచేయుచు యాచనచే జీవించుటయు మిగుల గర్హితము. పరులనడిగికొని జీవించుటకంటె నగ్నిలోఁబడి ప్రాణములువీడుట మేలు. లోకమున మనుజుఁడు దారిద్ర్యమువలన లజ్జితుఁడగుచున్నాఁడు. లజ్జవలన సామర్థ్యము చెడుచున్నది. అసామర్థ్యమువలన నవమానము ప్రాప్తమగుచున్నది. అవమానమువలన దుఃఖము నొందుచున్నాఁడు. దుఃఖమువలన బుద్ధిహీనుఁడగుచున్నాఁడు. బుద్ధిహీనతవలన నశించుచున్నాఁడు. కావున దారిద్ర్యమే సర్వాపదలకు మూలము. సేవావృత్తి మానమును వెన్నెల చీఁకటిని ముదిమి సౌందర్యమును, హరికథ పాపమును హరించునట్లు నూఱు సుగుణములనైన యాచనావృత్తి హరింపఁగలదు. అని చింతించి మఱియుఁ బరాన్నముచే నుదరమును నిండించుకొందునా? ఓహో! అదియు మహత్తరమైన మృత్యుద్వారము. రోగియుఁ, జిరప్రవాసియుఁ, బరాన్నభోక్తయుఁ, బరగృహనివాసియు, నను నీనలువురకును జీవిత

కాలము మరణము, మరణము విశ్రాంతి. కావున నయ్యదియు యుక్తముకాదు. అని తలంచియు లోభమువలన మఱల నర్థసంగ్రహము సేయనెంచి యీ గృహముననే వాసము చేయుచుంటిని. లోభముచే బుద్ధి చలించును. లోభమే దురాశను గలిగించును. దురాశవలన దుఃఖము గలుగును. పిమ్మట నొకనాఁడు చూడాకర్ణుఁడు నన్నుఁ గాంచి తనచేతి దండముతో నొకదెబ్బ వైచెను. నిశ్చయముగా నసంతుష్టుఁ డాత్మద్రోహి యగుచున్నాఁడు. ఎవ్వనిమనసు సంతుష్టినొందునో వానికి లోకము సంతోషమయమై కానవచ్చును. చెప్పులోపల నిమిడిన పాదమునకు భూమియంతయుఁ జర్మావృతమైనట్లు మృదువుగఁ దోఁచుట లేదా? సంతోషామృతతృప్తులగు శాంతాత్ములకుఁ గలసుఖము ధనాశా లుబ్ధులై యటునిటుఁ బరువిడువారి కెన్నఁటికిని లభింపదు. ఆశవిడిచినవాఁడే పండితుఁడు. వాఁడే సర్వకర్మల నాచరించినవాఁడు. ఒకరిగుమ్మమును గాయక విరహబాధ నొందక దీనాలాపములు వలుకక జీవించుభాగ్య మెవ్వనికో పుణ్యాత్మునకు లభించును. ఆశయను గుఱ్ఱముపై స్వారిచేయువానికి వేలకొలఁది మైళ్లయినను దూరముగఁ దోఁచదు. కావున నీయవస్థకుఁ దగినయేర్పాటు చేసికొనవలయును. కులమునిమిత్త మొకని నాశమున కంగీకరింపవలయును. గ్రామము నిలుపుట కొకకులము విడువ వలయును. దేశమునకై గ్రామనాశ మంగీకరింప వలయును. ఆత్మసంరక్షణార్థము సర్వమును ద్యజింప వలయును. అని నీతివేత్తలు వచింతురు. కావున నిపుడు దేశ

త్యాగమున కంగీకరింప వలయును. ఎంత గొప్పవాని నాశ్ర యించినను ఫలము కర్మానుసారముగ లభించును. వాసుకి సర్వేశ్వరుండైన సాంబశివుని కంఠాభరణమయ్యు వాయు భక్షణమే చేయుచున్నది. పసుగత్తి పాలుద్రాగుటకంటె నిలిచి నీరుత్రాగుట శ్రేయము. అని యాలోచించి నిర్జన వనము నాశ్రయించితిని. ధనహీనుండై బంధుజనుల మధ్య మున వసించుటకంటె ఫలమూలాశియై వనమధ్యమున వృక్ష మూలమున వసించుట శ్రేయము. పిమ్మట నాపుణ్య వశమున నీతసితో స్నేహము కలిగెను. ఇపుడు నీయాశ్రయ మను స్వర్గము నాకు లభించినది. అనిన మంథరుం డిట్లనియె. సంసార విషవృక్షమునకుఁ గావ్యామృతపానము సజ్జన సహ వాసము ననునవి రెండుఫలములుమాత్ర మమృతతుల్య ములు. అర్థములు పాదరసమువలెఁ జంచలములు. జన్వ నము ఝురీవేగతుల్యము. శరీరము బుద్బుదప్రాయము. ప్రాణము ఫేనసదృశము. ఈయర్థము విచారించి ధర్మము నాచరింపని మందబుద్ధి వార్ధకమునఁ బశ్చాత్తప్తుండై శోకాగ్ని కింధనంబగును. నీచేతను మిక్కిలిగ ధనము సంపాదింపఁబడి నది. దానిదోషమిది. తాను సంపాదించిన ధనమునకు త్యా గమే సంరక్షకము. సరసులోనిజలము పరిశుద్ధముగా నుండ వలయునని తలంచిన నీరుపారుటకు మార్గముఁజూపవలయును. ధనమును భూమిలోపలఁ బాతియుంచుట దానినాశమునకుఁ ద్రోవఁజూపుటయే. తనసౌఖ్యమున కుపయోగించుకొనక ధన మార్జించువాఁడు పరులకు మోపుమోయువానివలె క్లేశ

మునకుమాత్రము పాత్రము. ఒకనికియ్యని తాననుభవింపని ధనమున్నమాత్రమున ధనవంతుఁడైనచో భూమిలో నదృశ్యములైన నిధులచే నెల్లరు భాగ్యవంతులే. లుబ్ధునకు వాని ధన మనుభవింప రాకుండుటచే దరిద్రునికంటె భేదములేదు. కాని యాధనము నాశమైనపుడు దుఃఖమొకటి విశేషము. లోభి తనధనమును దేవవిప్రజ్ఞాతులకును దనకును గూడ వినియోగింపఁడు. కడ కగ్నిపాలో తస్కరులపాలో చేయుచున్నాఁడు. దానమిచ్చువానికిఁ బ్రియవాక్యము, జ్ఞానికి గర్వరాహిత్యము, త్యాగికి ధనము, నియ్యవి దుర్లభములు.

క. తను ధనముగడన యత్యా
ర్జనమది యుక్తంబుగాదు ♦ జంబుకము హృదిక్
ధనురాఘాతముచే మృతిఁ
గనదొక్కొ దురాశఁజెంది ♦ కానఁ దగదు సూ.

అనిన లఘుపతనక హిరణ్యకులు మాకాకథ వినిపింపుమనిన మంథరుం డిట్లనియె.

## దురాశపడి చచ్చిన నక్కకథ.

కల్యాణకటకమను పురమున భైరవుండను వ్యాధుండు గలఁడు. వాఁడు మాంసార్థియై ధనువును ధరించి వింధ్యాటవిని గూర్చి పోయెను. అచట వాఁ డొకమృగమును జంపి మోసికొని వచ్చుచుండఁగా మార్గమధ్యమున వానికొక సూకరము గానవచ్చెను. అంతట వాఁడు తన భుజముపైనున్న మృగమును భూమిపైనుంచి బాణముతోఁ బందిని గొట్టెను,

ఆ వ్రేటుపడి పంది క్రోధమున ఘుర్ఘురించుచు వచ్చి తన కోఱలతోఁ గిరాతునిఁ జీల్చివైచెను. వాఁడు నేలపైఁబడి మృతుఁడయ్యెను. సూకరము కిరాతుని బాణఘాతముచే నచ్చటనే పడి చచ్చెను. ఆ కిరాత వరాహముల పాదాహతిచే నచ్చట నొక సర్పము హతమయ్యెను. అంతలో దీర్ఘరావమను నక్కయొక్కటి వచ్చి చచ్చిపడియున్న కిరాతాదులఁ గాంచి యిట్లు చింతించె. "ఆహా! ఏమి నాయదృష్టము! ఆకస్మికముగా నాకుఁ జక్కని భోజనము సంప్రాప్తమైనది. అచింతితములైన దుఃఖము లెట్లు ప్రాప్తములగునో దేహికి సుఖములు నట్లే ప్రాప్తించుచున్నవి. వీనిమాంసము నాకు మూఁడుమాసములు భుజించుటకుఁ జాలును. మనుజుని మాంస మొకమాసము, మృగ సూకరముల పలలము రెండుమాసములు భుజింపవచ్చును. పాము నొక్కనాఁడు దినవచ్చును. నేఁటి కీ ధనుర్గుణమును భక్షించెదను. ఇయ్యది యెండుచర్మమగుటచే మాంస భోజనానంతరము రుచింపదు. కావున ముందుగనే భక్షించెదను." అని సమీాపించి యా ధనుర్గుణమును బండ్లతోఁ గొఱికెను. తోడనే విల్లు బెట్టువదలి హృదయమునఁగొట్టెను. ఆదెబ్బతో నక్క భూమిపైఁబడి మృతినొందెను. కావున నతిసంచయేచ్ఛ తగదని చెప్పితిని. ఒకరికిఁ బెట్టి తాను భుజించినదే ధనము. మృతుఁడైనవాని దార ధనాదులు పరుల పాలగుట మనము గాంచుట లేదా? ఇపుడు గతజల సేతుబంధన మేల? తెలివిగలవా రలభ్యమగుదానిని గోరరు. నాశమైన దానికి శోకింపరు. ఆపద వచ్చినపుడు మోహము

నొందరు. నీవు తెలివిగలవాఁడవు. ఎల్లపుడును హెచ్చరిక గలిగి వర్తింపుము. శాస్త్రములుచదివినమాత్రమున మూర్ఖులు లాభము నొందఁజాలరు. సద్విషయములు తెలిసినవారు క్రియారూపమున నాచరించినపుడే మేలునొందగలరు. ఔషధముచేయు విధానము నెంతచక్కఁగ నేర్చిన నౌషధము సేసి యుపయోగింపక రోగము శాంతించునా? కార్యములయెడఁ బిఱికితనముగలవాని పాండిత్యము గ్రుడ్డివానికిఁ జేతిలోనిదీపమువలె నిరర్థకము. ఇపు డీకష్టదశయందు నీవు ధైర్య మవలంబింపవలయును. వచ్చినకష్టమును మహాకష్టముగ భావింపరాదు. "రాజు, కులస్త్రీలు, మంత్రులు, పయోధరములు, దంతములు, కేశములు, నఖములు, నరులు స్థానభ్రంశముఁ బొందిరేని రాణింపరు" అనువాక్య మల్పుల విషయము. సింహసత్పురుషగజములు స్వస్థానములు వీడియు గౌరవింపఁబడుచుండుట లేదా? కాపురుషమృగాదులు స్వనివాసమును వీడఁజాలక యచ్చటనే నాశము నొందుచున్నవి. వీరుఁడైనమానవునకు స్వదేశమనియుఁ బరదేశమనియు భేదములేదు. ఏదేశమునకేగిన నాదేశమే స్వార్జితముగాఁ జేసికొనుచున్నాఁడు. సింగ మేవనమునకేగిన నావనమునందే మృగరాజపదము నధిష్ఠించుచున్నది. నిండుగ జలముగల సరస్సును గప్పలు, జలపక్షులు నాశ్రయించునట్లు సదుద్యోగియైనపురుషుని సర్వసంపదలు తమంతటఁదామే వచ్చిచేరును. సుఖము నెట్లనుభవించుచున్నారమో, అట్లే దుఃఖము ననుభవింపవలయును. సుఖదుఃఖములు చక్రము రీతిని దిరిగి

వచ్చుచుండును. ఉత్సాహసంపన్నుఁడై దీర్ఘసూత్రుఁడుగాక కార్యాకార్యజ్ఞుఁడై దుర్వ్యసనిగాక కృతజ్ఞుఁడగు పురుషుని లక్ష్మి స్వయముగా వచ్చి పొందును. అర్థములు లేకుండి నను ధీరుఁడు గౌరవస్థానమును బొందుచున్నాఁడు. ధనము గలిగినను కృపణుఁడు పరిహాసాస్పదుఁ డగుచున్నాఁడు. నూఱు బంగారుసొమ్ములు వెట్టినను స్వభావజనితమైన సింహము నైసర్గిక తేజమును శ్వానము గాంచఁగలదా? పూర్వము ధనవం తుఁడనని నీకు మదమును లేదు. ఇపుడా ధనము పోయెనని విచా రమును లేదు. మనుజుల ప్రాణ్లు కందుకము ప్రాణ్లవంటివి. మేఘచ్ఛాయ, క్రూరులతోడి స్నేహసుఖము, లేఁబచ్చిక, స్త్రీలు, జవ్వనము, ధనము నను నివి కించిత్కాలోపభోగ్య ములు. వృత్తికై యత్యంతము పాటుపడుట వ్యర్థము. అయ్యది జన్మకాలముననే భగవంతునిచే నియమింపఁ బడి నది. చూడుము! జంతువు తల్లిగర్భమునుండి యివ్వలఁబడిన తోడనే తల్లిరొమ్ము చేఁపుచున్నది. అనిన విని లఘుపతన కుఁడు మంథరుఁడా! నీవు ధన్యుఁడవు; సర్వదా శ్లాఘింపఁదగిన వాఁడవు. ఏభగవంతుఁడు హంసములను దెల్లగను, జిలుకలను బచ్చగను, మయూరములను జిత్రవర్ణములుగను సృష్టించెనో యాతఁడే వానికిఁదగిన యాహారమునుగూడఁ గల్పిం చినవాఁడు. మిత్రుఁడా! హిరణ్యకా! మఱియొకటివినుము. ధనము గడనయందొకదుఃఖమును నాశమందొకదుఃఖమును గలిగించుచున్నది. అది యున్నంతకాలము మదజనకమగుచు న్నది. కావున ధన మెప్పుడును సుఖావహముకాదు. ధర్మా

ర్థము విత్తమును గడించుటయు నుత్తమముగాదు. బురదఁ ద్రొక్కి కాలు గడిగికొనుటకంటెఁ ద్రొక్కకుండుటయే మేలు. మాంస మాకసమునఁ బక్షులచేతను, భూమిపైఁ గ్రూరజంతువుల చేతను, జలములందు మత్స్యములచేతను భక్షింపఁబడునట్లు ధన మెవ్వనికి దొరకిన వానిచేతనే భక్షింపఁబడును. మృత్యువువలన నెల్లప్రాణులకు భయము గలయట్లు ధనవంతునకు సర్వజనులవలన భయముగలదు. ఆశయొక్కటి విడిచిన దరిద్రుఁడెవ్వఁడు? భాగ్యవంతుఁ డెవ్వఁడు? ఆశకు మనసునఁ జోటిచ్చినవాని శిరస్సుపై దాస్య దేవత తాండవించును. భోగమువలనఁ గోరికలు తీరఁజాలవు. మనసు తృప్తినొందిన సర్వార్థములు సిద్ధినొందును. బహు భాషణములేల ? స్నేహాలాపములు సల్పుచు నాతోడ నిట వసింపుము. సజ్జనులకు స్నేహము లామరణాంతములు, కోప ములు క్షణభంగురములు, త్యాగములు నిర్విచారములు నగుట సహజము. బురదలోఁ గ్రుంగినఁ గజములకు దంతా వళములె యుద్ధర్తలగునట్లు సజ్జనులకు సజ్జనులే యాపదుద్ధార కులు. గుణవంతునిఁ గాంచి గుణవంతుఁడే యానందింప వల యును. గుణహీనునకు గుణవంతుని సుగుణమును గ్రహింపఁ జాలు సామర్థ్యము కలుగదు. కమల పరిమళమును ద్విరే ఫము గ్రహింపఁగలదు గాని సమీపవాసియైనను మండూ కము గ్రహింపఁగలదా? ఎవ్వని కోప ప్రసాదములు శత్రు మిత్రులందు సార్థకము లగునో వాని యొక్కనిజన్మమే సార్థ

కము. వాఁడే శ్లాఘ్యుఁడు. వాఁడే సత్పురుషుఁడు. అని యిట్లు మంథర లఘుపతనకులచే హిరణ్యకుఁ డాశ్వాసింపఁబడియెను.

పిమ్మట నొకనాఁడు వారు ముగ్గురు స్నేహాలాపములు సల్పుచుండగాఁ జిత్రాంగుఁడను మృగ మొకటి వారియొద్దకుఁ బాఱివచ్చెను. దానినిజూచి భయపడి మంథరుఁడు సమీపస్థ మగు జలాశయమునఁ బ్రవేశించెను. హిరణ్యకుండు వివర మునఁ దూఱెను. లఘుపతనకుఁ డెగిరి వృక్షాగ్రము నెక్కెను. లఘుపతనకుఁడు దూరముగ వీక్షించి భయమునకు హేతు వేమియు లేకుండుటఁ దెలిసి మిత్రులకుఁ దెలిపెను. వారు ముగ్గురు భయములను వీడి యొకచోటఁ జేరిరి. అపుడు మంథ రుఁడు చిత్రాంగునిగాంచి "ఓ యతిథీ! నీకు స్వాగతమా? ఇచట నీ యిచ్చవచ్చునఁ దృణజాలముల భక్షించి జలమును గ్రోలుము" అనినఁ జిత్రాంగుఁ డిట్లనియె. నేనొక బోయ వానిచేఁ దరుమఁబడి మీ మఱుఁగుఁ జొచ్చితిని. లోభమునఁ గాని వెఱచిగాని శరణాగతునిఁ బరిత్యజింపరాదు. అట్లు చేసినవానిని బ్రహ్మహత్యకు సమానమగు పాపము పొందు నని ధర్మజ్ఞులు వచింతురు. కావున నన్ను రక్షించి మీ మిత్రు నిగ నంగీకరింపుఁడు. అనిన హిరణ్యకుం డిట్లనియె. మాతోడి మైత్రి నీ కయత్నముగనే సిద్ధించినది. ఔరసుఁడు, కృత సంబంధి, వంశ క్రమాగతుఁడు, రక్షితుఁడు, అను నీ నలు వురు మిత్రులనఁబడుదురు. వారిలో నీవు రక్షితుఁడ వగుటం బట్టి స్వయముగనే మాకు మిత్రుఁడవు. కావున నియ్యది నీ యిల్లుగ భావించి సుఖముగ వసింపుము. అనిన మృగము

సానందమై గ్రాసముఁగొని పానీయముఁ గ్రోలి వటవృక్షచ్ఛాయను వసించె.

పిమ్మట మంథరుండు చిత్రాంగా! నిన్నవండు బెదరించె. ఈనిర్జనవనమందుఁ గిరాతులు సంచరించుచున్నారా యేమి? అనినఁ జిత్రాంగుఁడు "ఔను. అదియునుంగాక మఱియొకటి వినుఁడు. కళింగదేశమున రుక్మాంగదుఁడనురాజు గలఁడు. అతఁడు దిగ్విజయప్రసంగమున వచ్చి నేఁడు చంద్రభాగానదీతీరమున విడిసె. రేపు ప్రాతఃకాలమున నీకర్పూరసరోవరతీరమున విడియంగలఁడని జాడ తెలియుచున్నది. కావున నీప్రాంతమున వసించుట ప్రమాదమని తలంచుచున్నాఁడను. ఇపుడు మిమ్ముఁగాంచి కొంతధైర్యము నొందితిని. రేపటి కర్తవ్యమును మీ రాలోచింపుఁడు" అనిన విని కూర్మము భయముతో నిట్లనియె. నేనిఁక నీసరసునఁ బ్రవేశింపను. మీతోడ నెటకైనఁ బాఱివచ్చెదను. అనినఁ గాకచిత్రాంగులు సరియనిరి. హిరణ్యకుండు కొంచెము విచారించి మంథరునకు జలాశయమున మునుంగుటయే క్షేమము. మెట్టపైఁ బోవునపు డొకయాపద వచ్చినఁ దప్పింప నుపాయములేదు. జలచరములకు జలమును, మృగములకు వనమును, రాజులకు సైన్యమును దుర్గములు. అని లఘుపతనకుని వైపుచూచి, ఓయీ! మిత్రా! లఘుపతనకా! నీమాట విని మెట్టపై నడచిపోవునపుడు మంథరున కొక యాపద తటస్థించిన పక్షమున, తోఁక శత్రువు చేతికిచ్చి ప్రతీకారముగానక కీడ్వడిన జంబుకము చందమున హాని నొందుదుము.

ఆ॥ వె॥ తలుపు గడియదీయఁ • దనతోఁక దలుపు రం
ధ్రమ్ములోన దూర్చి • యిమ్ము దప్పి
పోనివాఁడు తోఁకఁ • బూని లాగఁగఁ జచ్చె
నక్క మును లఘుపత • నకుఁడ! వినుము.

ముక్కొక బాలుం డజారోహణకుతూహలాయత్తచిత్తుండై యురవణంబులకై యరయుచుఁ దత్పురప్రాంతకాంతారము చెంతనున్న గొఱ్ఱియల మందకేఁగ నట తద్రక్షకుం డతిక్రూరుండు వానికి దృగ్గోచరుండయ్యె. అబ్బాలుండు వాని పోవునంతకొక మాటునం బొంచియుండె. అంత వ్యాఘ్రంబొక్కండు వచ్చి పొంచి యా గొఱ్ఱియల కాపరిం గాంచి రాత్రియగునంత దనుక నొక లతానికుంజంబున నడంగియుండె. అంతఁ జీఁకటి పడుటయు నా గొల్లఁడు తన పుత్రునితో "నాయనా పులియో పుట్రయో జాగ్రతగా గొఱ్ఱెలం జూచుచుండుము" అని చెప్పి భోజనంబునకు గృహంబున కరిగె.

ఈమాట పులి విని "పులియనఁగా నేను, పుట్రయనగా నేమో? యెఱుంగను. అయ్యది నాకంటె బలమైన క్రూరజంతువై యుండనోపును" అని తలంచుచుఁ బొదవిడిచి గొఱ్ఱెలలోఁ బ్రవేశించి తనకు భోజనార్హమైన మంచి గొఱ్ఱెకై వెదకుచుండె. బాలుండు నెమ్మదిగ నా మందలోఁ జొచ్చి తన కారోహణార్థము బలిసిన గొఱ్ఱెకై తడుముచుండెను. అంత దైవవశమున నాతని చేతికి పులి దొఱకెను. వాఁడు పులిని బలిసిన గొఱ్ఱెయని తలంచి సంతసించుచుఁ దటాలున దాని వీఁపుమీఁద నెక్కి కూరుచుండెను. పులియుఁ దన మన

సుఖోని భయము చొప్పున గొల్లవాఁడు చెప్పిన పుల్లయో వచ్చి తన వీఁపుమీఁదఁ బడెనని భయపడి పరువెత్త నారంభించె. వాఁడును దానెక్కి-నగొట్టె చక్కఁగఁ బరువెత్తుచున్నదని సంతసించుచు రాత్రియంతయు దానిపై స్వారిచేసెను. అంతఁ నరుణోదయం బగుటయు నా చిరువెలుగున దాని వీఁపుమీఁది చారికెలు గానరాఁగ నది పులియని తెలిసి భీతుఁడై యాపులి యొక చెట్టుక్రిందినుండి పరువెత్తుచుండ వాఁడా వృక్షము వ్రేలుగొమ్మల గ్రహించి యాభూరుహము మీఁది కెగఁబ్రాకి నిట్ట గొమ్మమీఁదఁ గూరుచుండెను. పులియుఁ దన మీఁదినుండి పుల్లదిగిపోకకు సంతసించుచు నాప్రాంతమునఁ గూరుచుండి యాయాసము దీర్చుకొనుచుండెను. అంత నొక నక్క-వచ్చి పులినిజూచి జఱిగిన వృత్తాంతమును దెలిసికొని పులి తెలివితక్కు-వకుఁ బరిహసించి యాప్రాంతమంతయుఁ దిరిగి వృక్షాగ్రమునఁ గూరుచుండిన మనుష్యుని జూచి యా మెకమునకుఁ జూపి యిట్లనియె. ఈతనిని గ్రిందికి దింపెదను. నీవు వీనిని జీల్చి చంపి నీ పగ దీర్చికొనుము. అనిన నాపులి యిట్లనియె. వీని నీచెట్టుమీఁదనుండి దింపుట నీకుసాధ్యమగునా? నీ వెట్లు దింపెదవు? అనిన నా నక్క-:—రాజా! ఉపాయమున సాధ్యమగును. ఒకజంబుక ముపాయముచేత నేనుంగుం జంపె. చెప్పెద వినుము.

### ఉపాయముచేత నక్క- యేనుఁగును జంపిన కథ.

ఒకఘోరవనమునందుఁ గర్పూరతిలకమను నేనుంగు గలదు. దానినిగాంచి నక్క-లన్నియు "నీగజము నేదైన నుపా

యము సం జంపితిమేని దీనిమాంసముచేత మనమందరము నాలుగుమాసములు జీవింపవచ్చును'' అని చింతించుచుండ వానిలో నొకముసలినక్క ''చూడుఁడు నాదుబుద్ధిబలంబున నీదంతి నంతంబునొందించితీరుదు'' నని ప్రతిజ్ఞచేసి యాకరిని సమీపించి సాష్టాంగముగ నమస్కరించి ''దేవా! మమ్ముల ననుగ్రహింపుము'' అనియె. హస్తి దానిని గాంచి ''ఓసీ! నీకు మావలన నేమికావలయును?'' అని యడిగిన నావంచ కుం డిట్లనియె. ''నేను జంబుకుండ. ఈవనంబున వసించు జంతువులన్నియుఁ జేరి నన్నుఁ బంప మీసమీపమునకు వచ్చి నాఁడను. ఏలయన రాజులేని రాజ్యమున వసింపరాదు కావున నీవనరాజ్యమునఁ బట్టాభిషేకము చేయుటకు రాజలక్షణ యుక్తుఁ డెవ్వండని విచారించి యట్టిగుణవంతులుగ మిమ్ము నిర్ధారణముసేసిరి. కులాచారసంపన్నుఁడు, శుద్ధుఁడు, ప్రతాప వంతుఁడు, ధార్మికుండు, నీతికుశలుండు, నగువాఁడు రాజ్యార్హుఁడు. ఈగుణములన్నియు నీయందుగలవు. మఱియొకటి వినుము రాజును ముందుగఁ జూచికొని పిమ్మట దారధ నాదుల నార్జింపవలయును. పృథివీపతి పర్జన్యునివిధమున లోక మున కాధారుఁడు. వానలేకున్నను గొంతకాలము జీవింప వచ్చునుగాని రాజులేకున్నఁ దక్షణమే లోకము నశించును. సాధువృత్తముగలిగి విషయలంపటుఁడుగాక పాలించు రాజీలో కమున దుర్లభుఁడు. రాజదండమువలని భయమున నెగదాభర్త కురూపియైనను, నిర్ధనుండైనను, నంగవికలుఁడైనను, యువతులు మగలతోఁగాపురముసేయుచున్నారు. దేవా! లగ్నవేళ యతి

క్రమింపకమున్నె నావెంట విచ్చేయుము." అనిన రాజ్యలోభాక్రుష్టమానసమై యామహాగజము సృగాలము వెంటనేగి మార్గమధ్యమున నొకమహాపంకమునఁ గ్రుంగఁబడి "మిత్రమా! ఫేరవా! బురదలో దిగఁబడితిని. ఇపుడు నేనేమి సేయుదు" ననిన నక్క "గజోత్తమా నాదు వాక్యమును విశ్వసించి నావెంబడిని వచ్చితివి కావున నాదు పుచ్ఛమును నీకందించెదను దానినూఁతఁ గొని యివ్వలకు రాఁజాలుదువా?" అని పరిహాసమాడెను. సజ్జనసహవాసము దూరమైనకొలఁదిని దుర్జనసాంగత్య మధికమగును. పిమ్మట జలాహారాదులు లేక యాగజము మృతినొందగ నెల్లనక్కలు వృద్ధజంబుకంబును శ్లాఘించుచు దానిపలలమును భుజించె. కావున నుపాయమున నెట్టి కార్యమైన సాధ్యమగునని నుడివితి ననెను.

పిమ్మటఁ జంబుకమ్ము సెప్పిన యుపాయము చొప్పున నా మువ్వన్నె మెక మించుక దూరమేగి యొక పొదరుటింటి చాటున దాఁగె. వృక్షాగ్రముననున్న యాబాలుఁడు వ్యాఘ్రము వెడలిపోయిన దని చింతించి నెమ్మదిగ చెట్టు దిగెను. అంత నాపులి చూచి శర వేగముతో వానిపైఁబడవచ్చుచుండె. వాఁడును మరల వృక్షమెక్కుటకు వ్యవధానము లేనందునఁ బరుగెత్త నారంభించెను. అంత దైవవశమున నాప్రాంతమున నొక పాడు దేవళము వానికిఁ గానవచ్చె. వాఁడును ప్రాణభీతిచే నా గుడిలోఁ దూటి గర్భాలయమ్మున కేగి తలుపు వేసికొని గడియ వైచికొనెను. వ్యాఘ్రము నక్కతోఁ గూడ నాకోవెలలోఁ బ్రవేశించె. అంత నక్క పులితో నిట్లనియె. రాజా! నన్ను

నీవు చేతులతో నెత్తుము నాతోఁకను తలుపు చిల్లులో దూర్చి గడియదీసి వైచెదనని దాని యుపాయమునకు సంతసించి పులి దానిని బట్టి పైకెత్తె. అంత నా వంచకము తన వాలము కవాట రంధ్రమునఁ జొప్పించుటయు నా లోపలనున్న కోంటి వాఁడు తటాలున దానిపుచ్ఛమును రెండు చేతులతో బట్టి లోనికి లాగివైచె. జంబుకము వాని పట్టు విడిపించు కొనఁ జాలక విలవిలఁ గొట్టుకొన నారంభించెను. ఎంత సేపటికిని గడియను దీయకుండుటచే విసివి పులి నక్కను విడిచిపెట్టె. ఆ వంచకము తలక్రిందుగ వ్రేలఁబడి చాల సేపటికి మృతినొందె. దాని దుండగపుఁజర్యలను గాంచి యా పులి భయపడి ప్రాణము దక్కినఁ జాలును. ఇక్కడ నుండిన మనకు నేదైన హానిచేయఁ గలఁడని తలఁచి యటనుండిపాఱిపోయె. వాఁడును నాసంగతి యెఱింగి నెమ్మదిగ గ్రామమును జేరి సుఖంబుండె. కావున నపాయమైన కార్యము సేయంజనదు.

అని చెప్పిన మంథరుండు హిరణ్యకుని మాటను బాటింపక మృగ హిరణ్యక లఘుపతనకుల వెంబడిని బయలుదేఱి వారెల్లరు మఱియొక తావునకుఁ బయనమై పోవుచుండిరి. మార్గమధ్యమున వేఁటకై వచ్చిన యొక వ్యాధుఁడు వీరి కంటఁ బడెను. వానిఁగాంచి మృగము పాఱిపోయెను. హిరణ్యకుఁడు వివరమునఁ దూఱెను. లఘుపతనకుఁడు దూరముగ నెగిరి పోయెను. మంథరుఁడు భయమునఁ గాళ్లువడంక నెమ్మదిగఁ బ్రాకుచుండెను. ఇంతలోఁ గిరాతుఁడు సమీపించి మంథరునిఁ బట్టుకొని తన వింటికొమ్మునఁ గట్టుకొని గృహాభిముఖుండై

పోవుచుండెను. వాయసాదులు మిగుల విషాదమునొందెను. హిరణ్యకుం డిట్లు దుఃఖించుచున్నాఁడు. "అయ్యో! ఒక దుఃఖానుభవము పూర్తి గాకుండఁగనె మఱియొక కష్టము నాకు సంప్రాప్తమయ్యెనే! 'కష్టమునందె కష్టము సుఖము నందె సుఖము' అను లోకోక్తి సత్యము. స్వభావజమగు మైత్రి లోకులకు వారి యదృష్టమునఁ గలుగును. దాని నాపద లందును వారు వీడరు. పురుషులకు మిత్రులయందుండు విశ్వాసము మాతృ సోదర భార్యాదులందును నుండదు. ఏమి నా దురదృష్టము.! స్వకృత కర్మానురూపములైన దశాఫలముల నిహలోకముననే యనుభవించుచున్నాఁడను. కాయము సన్నిహితాపాయము. సంపద యాపద్ధేతువు. సంగమము వియోగావహము. జన్మము నాశమునకు బీజము. శోక శత్రుభయాపహమును విసశ్వాసపాత్రమునగు 'మిత్ర' మను రత్నము నెవ్వఁడు సృజించెనో? మిత్రమనఁగ నేత్రముల కమృతాంజనము. మానసమున కానందము. సంపదాపదలందు వీడని మిత్రుఁడు దుర్లభుఁడు సంపదగలయప్పుడు ద్రవ్యాభిలాషులగు కృత్రిమ మిత్రు లెల్లెడల లభింతురు. విపత్తు నిజమగు మిత్ర రత్నముల దెలుపు గీటురాయి" ఇట్లు మిగుల వగచి హిరణ్యకుండు చిత్రాంగాదులఁ జూచి మన మీ వ్యాధుఁడు గ్రామమునఁ బ్రవేశింపక మున్నె యొక యుపాయముఁబన్ని మిత్రుని యాపదను దప్పింపవలయును. అనిన వారు హిరణ్యకా! నీవు బుద్ధిమంతుఁడవు. ఆ యుపాయమేదో నీవే యోచింపు మనుటయు హిరణ్యకుం డిట్లనియె. వీఁడు పోయెడి మార్గ

మున నొకకొలనుగలదు చిత్రాంగుఁడు ముందు పరువిడి పోయి యాకొలనిదగ్గఱఁ జచ్చినవానివలెఁ బడియుండవలయును. లఘుపతనకుండు చిత్రాంగునిపై వ్రాలి కనులు పొడుచువానివలె నుండవలయును. ఈలుబ్ధుఁడు చేతనున్నధనువును దీరముననుంచి జలమునుద్రాగి పిమ్మట మృగమునుగాంచి చచ్చి పడియున్నదని తలంచి చిత్రాంగుని సమీపింపఁగలఁడు. ఆసమయమును గనిపట్టి నేను జప్పుడుగాకుండ మంథరునిబంధములను గొఱికివైచెద. మంథరుఁడు సమీపస్థమగు కమలాకరమును బ్రవేశించును. అదిగని లఘుపతనకుఁ డఱచుఁగాక. అదివిని చిత్రాంగుఁడు లేచి పరువిడుఁగాక. ఇట్లాచరించిన మంథరునిఁ బ్రదికించినవార మగుదుము. అనిన మృగకాకము లందుల కంగీకరించి ముందుగ వెడలి హిరణ్యకుని చెప్పిన చొప్పున నుండెను. హిరణ్యకుండును జలాశయముచెంత బొఱియలోఁ బొంచియుండెను. ఇంతలోఁ గిరాతుఁడు తత్తీరముఁజేరి జలమునుగ్రోలి వృక్షచ్ఛాయను విశ్రమించి నలువలంకులు పరికించునంతఁ గపటమృతుఁడగు చిత్రాంగుఁడు కంటఁబడెను. వాని యాకారమును గాకి పొడుచుటయుఁ గాంచి మృగము చచ్చి పడియున్నదని తలంచి మంథరుని గట్టిన ధను వచ్చటనే విడిచి చిత్రాంగుని సమీపించునంత హిరణ్యకుండు తనకార్యమును నెఱవేర్చెను. మంథరుఁడు మడుఁగునం బడెను. వృక్షాగ్రమెక్కి చూచి లఘుపతనకుండు సమయమునకుఁ గూసెను. చిత్రాంగుఁడు తటాలున లేచి పలాయితుఁడై యదృశ్యుఁడాయెను. కిరాతుఁడు

మఱలి పూర్వము కూర్చుండిన తావును జేరుసరికిఁ దాఁబేలు గానరాదయ్యె. అపుడు వాఁడు "ఔరా! నా యవివేకము! మాంసమునకుఁ గచ్ఛపమునకునుగూడఁ జెడితినే! చేతఁజిక్కిన కించిల్లాభము నుపేక్షించి యలభ్యమైన మహాల్లాభమునకుఁ బ్రాఁకులాడువానికిఁ బూర్వ ప్రాప్తముకూడ నశించును. అలభ్య మెన్నఁటికి నలభ్యమే" అని చింతించుచు వచ్చిన మార్గముననే తన వీటికి వేంచేసె.

చూచితిరా! ఒక్క మూషికముతోడి మైత్రి కూర్మపతి కెంతలాభకారి యయ్యెనో? కావున నెల్లరును సన్మిత్రుల నార్జింప సర్వదా యత్నింప వలయును.

పిమ్మట మంథరాదు లందఱును వెడలి సుఖముగ జీవనము సేసిరి.

అని విష్ణుశర్మ చెప్పుటయు విని సానందులై రాజపుత్రులు "గురువరా! భవదీయ కృపావిశేషంబున మిత్రలాభమును వింటిమి. మా మానసములు వికాసమునొందినవి. భావికాలమున మాకత్యంతోప యుక్తములగు విషయములను స్వర్ణాక్షరములతో మా మనఃఫలకంబుల లిఖంచితిరి." అని వారు విష్ణుశర్మకు నమస్కరించిరి.

సుహృల్లాభము సంపూర్ణము.



# సుహృద్భేదము.



ఓ రాజపుత్రులారా ! ఇఁక సుహృద్భేదమును జెప్పుచున్నాఁడ

గీ. సింహవృషభమ్ములొక్క చోఁ జెల్మినుండ
వంచకుండొక్క డద్ది యోర్వంగలేక
రణముగలుగంగఁ జేసి పరస్పరంబు
వృషభుఁ జంపించె హరిచేత వినుఁడు మీరు.

దక్షిణాపథమున సువర్ణవతియను నగరము కలదు. అందు వర్ధమానుఁడను వర్తకుండు వాసము చేయుచుండెను. వాఁడు ధనవంతుఁడైనను దనకంటె మిక్కిలి భాగ్యవంతులైన తనబంధువులను గాంచి యిట్లు చింతించె. "మనుష్యుఁడు తనకంటె ధనహీనులను జూచినం దాను భాగ్యవంతుఁడుగనే తోఁచును. భాగ్యవంతులవైపు దృష్టిఁ బఱపినఁ దాను దరిద్రుఁడుగఁ గానవచ్చును. ధనము మిక్కిలి కలిగెనేని బ్రహ్మహత్య చేసినవాఁడైనఁ బూజ్యుఁడగును. సద్వంశజాతుఁడైనను ధనహీనుఁ డవమానితుఁడగును. వ్యవసాయహీనుఁడై మందబుద్ధిగలిగి దైవపరుండై సాహసరహితుఁడగు పురుషుని, వృద్ధుని యువతి కాంక్షింపనట్లు లక్ష్మి వరింపనొల్లదు. ఆలస్యము, స్త్రీసేవయు, ననారోగ్యము, జన్మభూమి వాత్సల్యము, భీరుత్వము, అసంతోషము ననునివి మహత్వమునకు వ్యాఘాతములని పెద్దలు వచింతురు. కావున నేను జన్మస్థాన వాత్సల్యమును వీడి యెటకైన ధనార్జనాపరుఁడనై పోఁగవలయును. స్వల్పమగు ధనమునకే తృప్తినొందువాని ధనమును గృత

కృత్యుఁడగు విధి వృద్ధినొందింపఁడు. మనుజుఁడు లేని దానిని సంపాదింపవలయును. సంపాదించిన దానిని రక్షింపవలయును. రక్షితమైన దానిని వృద్ధి నొందింప వలయును. పిమ్మట సత్పాత్రమున వినియోగింప వలయును. దానభోగవిహీనుఁడు కమ్మరితిత్తివలె శ్వాస సహితుఁడైనను నిర్జీవుఁడు. దాన భోగ విహీనుని విత్తము, పిఱికివాని బలముఁ, ధర్మాచరణము లేనివాని విద్యయు, జితేంద్రియుఁడు గానివాని తత్వజిజ్ఞాసయు నిష్ప్రయోజనములు. కావున సమార్జిత విత్తమును దానభోగములకు వినియోగింప వలయును'' అని చింతించి సంజీవక నందకము లనంబరఁగిన రెండు వృషభములం బూన్చిన శకటంబు సిద్ధంబు గావించుకొని దాన నానావిధ వస్తుజాతంబు లుంచుకొని వాణిజ్యార్థము కాశ్మీర దేశాభిముఖుండై పోగుచుండె. విద్యావంతులకుఁ బరదేశమును, ప్రియవాదులకు శత్రువును లేనట్లు వ్యాపారులకు దూరమను నది యొకటి లేదు. అతఁడు సుమర్గమను మహారణ్యమునఁ బ్రయాణము సేయుచుండగాఁ బ్రమాదమున సంజీవకము కాలు విఱిగి నేలఁ గూలెను. దానిఁ జూచి వర్ధమానుఁడు మనసులో ''నయజ్ఞుఁడు బహువిధముల యత్నము చేయవలయును గాని ఫలముమాత్రము దైవసంకల్పితమే లభించును. సర్వకార్యములకు విఘాతకమగు విస్మయమును మాని వచ్చినదానికిఁ బ్రతీకారముఁ జింతింపవలయును.'' అని తలంచి యచ్చటకు సమీపముననున్న ధర్మపురమను గ్రామమునకేగి బలిసిన యొక యెద్దును గొని తెచ్చి బండికిఁ గట్టుకొని సంజీవకము

నచ్చట విడిచి సాగి పోయెను. పిమ్మట సంజీవకుఁడు లేచి మూఁడుకాళ్లతో నడయాడసాగెను. సముద్రమున మునింగి నను, పర్వతాగ్రమునుండి క్రిందఁబడినను, ఆయుర్దాయవం తుఁడు చావఁడు. నూఱు బాణములు మర్మములఁ దూఱినను నకాలమున మృతినొందఁడు. కాలము సమీపించినవాఁడు ముల్లు గ్రుచ్చుకొన్నమాత్రాన గతించును. దైవరక్షితమగు నది మనుజుని ప్రయత్నము లేకయే జీవించును. దైవహతమై నది వేయిమంది రక్షించినను నశించి తీరును. దైవము మంచి దయ్యేనేని దిక్కులేనివాఁడును దుడ్డువలె నుండును. అయ్యది వ్యతిరేక మయ్యేనేని మహారాజు సహితము మాయ మగు చున్నాఁడు గదా!

అనంతరము దినములు కడచిన కొలఁదిని గడుపు నిండుగఁ దృణజాల జలాద్యాహారము లభించుటంబట్టి సంజీవ కుఁడు మిక్కిలి బలిసి యొకనాఁడు ఱంకె వైచెను. ఆవన మందుఁ బింగళకుఁడను మృగరాజు గలఁడు. ఆతఁడు దప్పిఁ గొని యమునాతీరమునకు జలముంగ్రోల నేగుచు నశ్రుత పూర్వమైన సంజీవకము భీషణారవము విని యులికిపడి కార ణము తెలియక భీతినొంది వెనుఁదిరిగి యిరవునకు మఱలి వచ్చి యా భీషణశబ్దమునకు హేతువేమని చింతించుచుండె.

ఆతఁ డాశబ్దమును విని భీతుఁడై తిరిగిపోవుట నాతని మంత్రిపుత్రులగు కరటక దమనకులను నక్కలు చూచెను. దమనకుఁడు కరటకునితో మిత్రుఁడా! యీతఁడు జలమును ద్రాగవచ్చి మఱలి పోవుచున్నాఁడు. కారణ మేమయి

యుండునో?. కరటకుఁడు:-సోదరా! నేనీతని సేవను మానుకొం
టిని. నీవును నామాట చొప్పున నీతని కొలువు చాలించితివి. అట్టి
మన కీతని చేష్టానిరూపణంబుతోఁ బని యేమి? ఈతని సేవకుల
మై యున్నపు డీతనివలనఁ బడినపాట్లు తలంచినంత మాత్ర
మునఁ దలనొప్పి యెత్తుచున్నది. సేవకవృత్తిచే ధనార్జనా
పరులై శరీరసౌఖ్యమును గోరి మూఢులు తమ శరీరమునకుఁ
గూడఁ దాము స్వాతంత్ర్యమును గోలుపోవుచున్నారు. పసు
లను గొల్చి పాట్లుపడుకంటె బుద్ధిమంతుఁడు తపస్సు చేసి
కొని సుఖపడవచ్చును: స్వాయత్తవృత్తి యగుటయే జన్మము
నకు సాఫల్యము. పరాయత్త జీవనుండు మృతతుల్యుఁడు.
త్రాఁచుపాములతోడి చెలగాటయు, పర ధనాపహరణము,
రాజసేవయు, సమానములగు సాహసములు. ధనవంతులు
యాచకులను రమ్ము, పొమ్ము, కూర్చుండుము, లెమ్ము, చదు
వుము, ఊరకుండుము, అనుచు వినోదింతురు. అర్థలాభమున
కై యవివేకులు సంస్కరించిన యాత్మను ధనవంతులకు విక్ర
యింతురు. ప్రకృతి చపలమై యశుచియందుఁగూడఁ బ్రసరిం
చు ప్రభుకటాక్ష వీక్షణమును సేవకులు గొప్పలాభముగ నెం
చుదురు. ఆహా! సేవకుఁ డెంత మూఢుఁడు! గౌరవమున కాశిం
చి పరునకు నమస్కారములు చేయుచున్నాఁడు. బ్రదుకుటకై
ప్రాణములను గోల్పోవుచున్నాఁడు. సుఖమును గోరి దుఃఖము
ననుభవించు చున్నాఁడు. ప్రభువు సేవకుని మానముఁ దాల్చిన
మూకవా! యని కసరును. ఎక్కువమాటలాడిన "సంధించినదా?
అట్లు ప్రేలుచున్నావు" అని తిట్టును. శాంతుఁడైన భీరువనును.

తాపసించినఁ జెప్పవలసిన దేమి? కష్ట భూయిష్టమయిన సేవా ధర్మము యోగీశ్వరులకుఁ గూడ నగోచరము. అనిన దమనకుం డిట్లనియె. మిత్రుఁడా! నీవట్లనఁ బోవకుము. మనసునకు వచ్చునట్లు సేవించిన సేవకుని మనోరథమును బ్రభువు లీడేర్తురు. నిరుద్యోగికి గజవారణాది సంపద లెట్లు చేకూరును? అనినఁ గరటకుండు కానిమ్ము! ఐననేమి? ఇపుడు స్వామిని గూర్చిన వ్యాపారము మన కనవసరము. అనవసర కార్యము సర్వదా పరిత్యాజ్యము. ఉబుసుపోవక యే కార్యముగాని సేయంజనదు. అట్లు సేయువాఁడు గోపాలకుని చందమున హాని నొందును. అనిన దమనకుఁడు గోపాలుఁ డుబుసుపోవక యేకార్యము చేసెను? వాఁడేమి హాని వడసెను? అయ్యది నాకుఁ దెలుపుమనుటయుఁ గరటకుం డిట్లనియె.

పూర్వ మొక గొల్ల పిల్లవాఁడు తోడి బాలురతోఁ దన పశువులను బొలమునకుఁ దోలికొనిపోయి మేఁపికొనుచుఁ జెలికాండ్రతో నాటలాడుచుండెను. ఆ ప్రాంతమున నొక పెద్ద పుట్టగలదు. అయ్యది సొగసైన శిఖరములతోఁ జూడ వేడుకగఁ జిన్న పర్వతమువలె నుండెను. ఆ బాలుఁ డద్దానిని జూచి యుబుసుపోవక యీ వల్మీకము పై కెక్కి దాని వివరము లెంత లోతునకుఁ గలవో చూచెదనని తలంచి తన చేతి కఱ్ఱతో నా పుట్ట బొఱియలోఁ బొడిచెను. ఆ పోటు పుట్టలోన నిద్రించుచున్న సర్పమునకుఁ దాఁకుటయు నయ్యది మహాకోపముతో బుసగొట్టుచుఁ బైకి వచ్చి యీ బాలుని బట్టి కఱచెను. అంతలో వాఁడు మూర్ఛితుఁడై పుడమిపయిం

బడి మృతినొందెను. దమనకా! క్షణకాల మనవసరప్రం బని సేసినందులకు గోపబాలుఁ డెంత హానినొందెనో చూచితివా? కావున మన మీ యనవసరప్రం బనికిఁ బూనరాదు. పింగళకునకుఁ గ్రొత్త యుద్యోగులు పెక్కు రున్నారు. స్వామికార్య విచారము వారిదిగాని మనదికాదు.

క. పరులొనరింపఁగదగు పను
లరసి శిరంబున ధరించు నాతఁడు పుడమిన్
ఖరతర తార స్వరకర
ఖరముం బలె హానినొందు కార్యమును జెడున్.

నీ కాకథ చెప్పెదను వినుము.

పరాధికారము పైఁబెట్టుకొన్న గాడిద కథ.

వారాణసియందుఁ గర్పూరపటుండను రజకుండు గలండు. వాఁ డొకనాఁ డలసి రాత్రివేళ గాఢనిద్ర నల్పుచుండెను, అపుడు వాని గృహంబున దొంగిలుట కొక తస్కరుఁడు ప్రవేశించెను. వానిగుమ్మముకడ నొకగాడిద కాలిబంధముతో సంచరించు చుండెను. శునక మొకటి ప్రక్కను గూరుచుండి చోరునిరాకను జూచుచుండెను. అపుడు రాసభ శునకముల కిట్లు సంభాషణము జరిగెను. గాడిద:—ఓశునకమా! దొంగ వచ్చినపుడు యజమానుని మేలుకొలుపుటకై మొఱుగ వలసినది నీకార్యము నీ వట్లు చేయవేల? కుక్క:—నాపని విచారించు కార్యము నీయదికాదు. నీ వీతని గుణము నెఱుంగవు. నే నీతని గృహంబును రాత్రింబవ ళ్లేమఱక రక్షించుచుంటిని. సుఖముమఱగి యజమానుఁడు తుదకు నావలని యుపయోగము

నైన గుర్తెఱుంగక పట్టెడుకూడుకూడ వేయుట మానినాఁడు. అప్పుడప్పుడు పనిమాని యజమానునకుఁ గష్టముఁ గలిగింప కున్న సేవకునిపై యజమానున కలక్ష్యము జనించును. గాడిద:—ఓరీనీచుఁడా? స్వభావమున నే యశ్పృశ్యముగు శునకమవు. మఱియుఁ గూలివాఁడవు. కావున నీజాతికిని నీ వృత్తికిని నీ స్వభావము తగియున్నది. పనిసేయుసమయమున గొణిగికొనుచుఁ జీతముచాలదని గొండాడుసేవకుఁడు సేవకుఁడా? కార్యము చెడినపిమ్మట యజమానునకు భృత్యునివలన ఫలమేమి? కుక్క:—ఔను నిజమే! పని సేయునపుడు గొణిగికొనుచు జీతమునకు గొండాడు సేవకుఁడు సేవకుఁడు కాఁడంటివి. పనివచ్చినపుడు మాత్రము సేవకులను గౌరవించి వారిపని దీరినపిమ్మట నుపేక్షించు ప్రభువులు సత్ప్రభువులెగదా? భార్యాపుత్రులంబోలె సేవకుని సహితమెల్లకాలము పోషింపవలదా? సేవకుని గుదుర్చుకొను కాలమున యజమానునకును, పనికిఁ గుదురునపుడు సేవకునకును, ధర్మములు వినునప్పుడు శ్రోతకును, సుఖముగనెయుండును. సేవకుఁడు జీతమడిగినపుడు యజమానునకును, యజమానుఁడు పనిచెప్పినపుడు నౌకరునకును, విన్నధర్మముల నాచరించుకాలమున శ్రోతకును, యమబాధగ నుండును. కావున నా విషయములను ముందుగనె గుర్తెఱింగి యిష్టములేకున్న నాయాపనులను మానుకొన వలయును. గాడిద:- నీవు పాపాత్ముఁడవు. స్వామి కాపద సంభవించినపుడు వానిపని నుపేక్ష సేయుచున్నాఁడవు నీవు సేయు మహాకార్యమఱచుటయే కదా? నీపని నాకుఁ జేతఁగాదా? మూఢుమ! నిమిష

మాత్రమున మనయజమానునిఁ బ్రబోధించెద. నని గట్టిగ నోండ్రలువెట్టెను. ఆ యఱపులు విని నిద్రాభంగమయ్యెనను కోపముతో లేచి ధావకుఁడు చేత నొకబడియఁ గొనిఖరమును మోదెను. ఆ దెబ్బలకుఁ దాళఁజాలక రాసభము మృతినొందె. కావున "పరాధికారముఁ బైఁబెట్టుకొనరాదు." అని నుడివితిని. ఇపుడు జంతువుల మృతకళేబరముల నన్వేషించుట మనకార్యము. మనపని చూచుకొందము రమ్ము!. అనిన దమనకుఁడు సావమానముగ నిట్లనియె. నీవు కేవలము కుక్షింభరుండవు. కడుపునకై ప్రాకులాడువాని కెన్నఁటికిని గారవము రాఁబోదు. మిత్రామిత్రుల యుపకారాపకారముల వాంఛించి ధీమంతులు రాజసేవ నంగీకరింతురు. కాని యుదరపూరణార్థము కాదు. అయ్యది నేరనివాఁ డుండునా ? ఎవ్వనిఁబట్టి పదుగురు బంధుమిత్రాదులుజీవింతురో వానిజన్మమే సార్థకము. కాకి తనముక్కుతో గింజల నేఱి పొట్టఁబోసికొని చిరకాలము జీవించుట లేదా ? అంతమాత్రాన నది ధన్యమనవచ్చునా ? ఐదు రూపాయలకు వచ్చునౌకరు గలఁడు. లక్షలు వేతనము గ్రహించు నుద్యోగియుఁ గలఁడు. జాతిచే మనుజుఁడు సమానుఁడయ్యు వృత్తిచేఁ దారతమ్య మేర్పడుచున్నది. సేవాధర్మము నీచమయ్యుఁ దనకార్యముఁ జక్కఁగ నెఱవేర్చుకొనుభృత్యుఁడుత్తముండుగఁ బరిగణింపఁ బడుచున్నాఁడు. వాజివారణ లోహములందును గాష్ఠపాషాణ వస్త్రములందును, స్త్రీపురుషతీర్థములందును మిక్కిలి తారతమ్యము గలదు. శునకము మాంసవిహీనమై దుర్గంధిలమైన యొక యెముక దొఱకి

నంతనె యవమానమును నొందుచున్నది. సింగము సమీపస్థమగు హరిణమును జంపి భుజింపక యేనుఁగుమాంసము లభించు వఱకుఁ బస్తుపడి యుండును. ఎల్లరును సత్వానురూపమగు ఫలమునే వాంఛింతురు. సారమేయము ముష్టిపరిమితమగు నన్నముఁ బెట్టువానియొద్దఁ జేరి తోఁక యాడించుచుఁ గ్రిందఁ బడి దొరలుచు నోరుఁజూపుచు సంతోషమును వెల్లడించును. అట్టి కుక్కకుఁ గడుపునకుఁ జాలినంత యన్నమైనను బెట్టరు. ఏనుఁగు ధీరముగ విలోకించుచుండినను మావటీఁడు దానిని బుజ్జగించుచు విలువగల యాహారమును నోటి కందించుచున్నాఁడు. కావునఁ బ్రాజ్ఞుఁడు పోషకుల పట్ల దీనుఁడై యుండరాదు. విజ్ఞానవిక్రమార్జితమగు యశము గలిగి క్షణకాలము జీవించిన నదిమేలు. కార్యాకార్యవిచారదూరుఁడై పలువురచే నవమానము నొందుచుఁ గుక్షిమాత్రపూరకుండై చిరము జీవించిన నది గర్హితము. అనినఁ గరటకుండు:—మనము ప్రధానులము కాము. మనకావిచారముతోఁ బనియేమి? దమనకుండు:—ప్రధానుఁడగుటకు నప్రధానుఁడగుటకు నెంత కాలము పట్టును. గురుత్వలఘుత్వములు స్వకార్యాయత్తములు. అయినను బెద్దఱాతిని బర్వతాగ్రము నెక్కించుట కష్టముఁ గ్రిందికిఁ ద్రోయుట సుకరము నైనట్లు మనుజుఁ డుచ్చస్థానమును బ్రాపించుట కష్టము నీచస్థానమునొందుట సులభము నగును. కూపమును ద్రవ్వువాఁడు క్రమముగఁ గ్రిందికిని గోపురముఁ గట్టువాఁడు మీఁదికి నేగునట్లు మనుజుఁడు స్వకార్యముచేత నే యుచ్చనీచస్థానములను బ్రాపించును. కావున

నోసోదరా! హార్త్స్యద్వ్యాఘ్రక్షమః స్వాయత్తమని తెలియుము. అనిన విని కరటకుండు:—సరి యందుకు నీవేమని యెదవు? దమనకుండు:—ఈమృగరాజు పింగళకుఁడు భయమునొంది మఱలి పోయినాఁడు. కరటకుఁడు:—ఆతఁడు భయపడెనని నీవెట్లు గ్రహించితివి? దమనకుఁడు:—తెలివిగలవారికిఁ దెలియనిది లేదు. చెప్పినయర్థమును బశువులు సహితము గ్రహింపఁగలవు. అనుక్తమైన యర్థమును గ్రహించుటయే తెలివిగలవానికి లక్షణము. ఆకారగతి చేష్టాభాషణ నేత్రవక్త్ర వికారాదులచేఁ బరుల మనోగతమును గ్రహింపవచ్చును. కావున నేనిపు డీతనిభయమును దీర్చి నా ప్రజ్ఞాబలమున నష్టమైన యుద్యోగమును మఱల సంపాదించెదను. కరటకుఁడు:—సఖా! నీవు సేవ యెఱుంగవు పిలువఁబడక పోవువాఁడు నడుగఁబడక చెప్పువాఁడును, రాజునకుఁ బ్రియుఁడనని భావించువాఁడును, బుద్ధిహీనులు. కావున నీవు పిలువని పేరంటమునకుఁ బోవలదు. అనిన దమనకుఁడు:—భద్రా నాకు రాజసేవయే తెలియదా? తనకుఁదాను బ్రకటించుకొనకున్న రాజులు తమంతటనే పిలిచి సమ్మానింతు రనుకొంటివా? లోకమున స్వభావమనోజ్ఞమగు పదార్థ మొకటి లేదు. ఎవ్వని కేదియిష్టమో వానికయ్యది బాగుగ నుండును. నీకు సేవకత్వము దూష్యముగఁ దోఁచె. నాకదియే గౌరవముగఁ గానిపించె. బుద్ధిమంతుఁడు ప్రభునిచిత్తమునకు వచ్చునట్లు మెలఁగి వానిఁ దనవశము కావించుకొనవలయును. ప్రభువు పిలుచునప్పటికి బద్ధాంజలియై యుండి యాతనియాజ్ఞ నెఱవేర్పవలయును.

ఆజ్ఞాభంగ మెన్నఁడును జేయరాదు. రాజుల కాజ్ఞాభంగము, బ్రాహ్మణుల కనాదరము, స్త్రీలకుఁ బృథక్ఛయ్యయు, శస్త్ర రహితమగు వధయని చెప్పుదురు. అల్పావమానములను సహించి సర్వదా రాజు ననుసరించి యాతనియాదేశములను గడుశ్రద్ధతో నొనర్చుసేవకుండు స్వామి కవశ్యము ప్రియుఁ డగును. అనినఁ గరటకుండు:—అనవసరముగఁ బ్రవేశించి నందుకు స్వామి నిన్నొకవేళ నవమానించిన నేమిచేయుదువు? దమనకుఁడు:—కానిమ్ము! అదియును సహింపవలసిన దే! కాని పోవకుండరాదు. దోషశంకచే కార్యానారంభము కాపురుష లక్షణము. అజీర్ణభయమున భోజనమును మానుకొను చున్నామా? దూరముననున్న చందనవృక్షముపైకిఁ బోవక లతలు సమీపస్థమగు చేదుచెట్టుపైఁ బ్రాకునట్లు ప్రభువులయు, యువతులయు మానసములు సమీపస్థుఁడు కుల గుణ రూప విహీనుఁడైనను వానినిపైఁ బ్రసరించుట స్వభావము. కరటకుఁ డు:-సరి నీవచ్చుటకేగి ముందుగ నేమనియెదవు? దమనకుఁడు:- ముందుగ స్వామి యనురక్తుఁడైయుండెనా? లేక విరక్తుఁడై యుండెనా? యని పరికించెదను. సుముఖుఁడైయుండెనేనిఁ బిమ్మటఁ దియ్యని మాటలచే స్వాయత్తునిఁ గావించుకొనియెద. కరటకుఁడు:—కానిమ్ము! జాగరూకుఁడవై వర్తింపుము. అసందర్భముగ భాషింపకుము. సందర్భానురూపముగ భాషింప కున్న బృహస్పతికైన నవమానము సిద్ధము. తేనెమాటలాడు వారు లోకమున నెందరేనిఁ గలరుగాని మేలుగోరి కఱకు లాడువాఁడును, వానిని వినువాఁడును దుర్లభులు. దమనకుండు:-

మిత్రా! వెఱవకుము. నేను సందర్భానురూపముగ నుడువను. ఆపదలందును కార్యములకుఁ గాలాతిక్రమణము సంప్రాప్త మైనపుడును ననాహూతుఁడైనను స్వామి మేలుఁగోరుభృత్యుఁ డూరకుండరాదు. సమయమువచ్చినపుడుకూడ మౌనముఁ దాల్చువాఁడు మంత్రిపదమునకుఁ బోవకుండుటయే మేలు. సోదరా! నాకు సెలవొసంగుము. పోయివచ్చెదను. కరటకుఁడు :—నీకు శుభమగుగాత! పోయిరమ్ము! నీయభీష్టము నెఱవేర్చికొనుము.

పిమ్మట దమనకుఁడాశ్చర్యముదోఁప మృగరాజునొద్ద కేగిన దూరముననె యాతని రాజు గాంచి రమ్మని పిలిచెను. తోడనే దమనకుండు సమీపమున కేగి సాష్టాంగముగ మ్రొక్కి యాతని యనుజ్ఞఁ బడసి సమీపమునఁ గూర్చుండెను. వారిరువురు నిట్లు భాషించిరి. పింగళకుఁడు :—దమనకా! చాలకాలమునకుఁ గానవచ్చితివి? దమనకుఁడు :—ఈ సేవకునివలన దేవర కించుకయుఁ బ్రయోజనంబు లేదు. ఐనను సమయమువచ్చినపుడు భృత్యుఁ డూరకుండరాదని తలంచి వచ్చితి. మహోన్నతములం దారి తేరి భయమన్న నెఱుంగని వీరాగ్రేసరులకుసహితము ప్రభుసన్నిధానమున మాటలు తడ వడుట సహజము. వాక్పాటవము గలవారుసహితము పండిత రాజసభలందును, నూతనస్త్రీసమాగమకాలములందును గాత రులగుదురు. కావున దేవా! నాదువాగ్దోషములను క్షమింపుము. అల్పులమగు మావంటివారివలనసహిత మొకప్పుడు ప్రభువులకుఁ బ్రయోజనముకలదు. తృణము సహితము దంతాం

తర్గతమగు నన్నాదికము నపనయింపను గర్ణాంతరాళమున గోకి కొన నుపయోగపడుచుండగా, కరచరణాదులుగల సేవకుని వలన సేగిగలదా? దేవరచేఁ బరిహృతుఁడనడుటచే నేను మతి చెడితినని తలంపరాదు. స్వభావజన్యమగు తెలివి కష్టము లనుభ వించినకొలఁదిని వృద్ధియగునుగాని క్షీణింపదు. కస్తూరికాపరి మళము శాపమున మానునా? తెలియనంతకాలము గాజుపూ సను శిరమున, రత్నమును బాదమున ధరింతుము. క్రయవిక్రయ స్థానమున నారెండిటి గౌరవలాఘవములు ప్రకటమగును. రాజావమానము నొందినమాత్రమున నల్పుఁడనని తలంపరా దు. అగ్నిజ్వాల క్రిందకుఁద్రిప్పినను నూర్ధ్వముగనే జ్వలించునట్లు ధీరుని ధైర్యగుణ మెన్నఁటికిని మాఱదు. దేవా! భృత్యులతార తమ్యమును వీక్షించుచుండవలయును. ఎల్లర సమానముగఁ జూచుచుండిన సమర్థుల యుత్సాహము క్షీణించును. ప్రభువు భృత్యులను వారివారి సామర్థ్యమున కనువగు కార్యముల నియోగింపవలయును. వ్యత్యస్తముగ నియోగించిన పక్ష మునఁ జూడామణిని బాదమున, నూపురము శిరమున ధరించిన వాని చందమునఁ బరిహాసమునకుఁ బాత్రుఁడగును. బంగారుపై నాటదగు రత్నము సీసమునఁ బొదిగిన రత్న మును బ్రకాశింపదు. సీసమును శోభింపదు. కాని యీ పని వాని బుద్ధిహీనత ప్రకటమగును. మణికాచలములకు స్థాన విపర్యాసము కావించిన నారెంటికిని మానావమానములు లేవు కాని యీ యొనర్చిన వానికే యవమానము కలుగును. వీఁడు బుద్ధిమంతుఁడు, వీఁ డనురక్తుఁడు, వీఁడు శూరుఁడు నని

యెఱుంగు రాజునకు సేవకులు సర్వవిధములఁ దోడ్పడుదురు. అశ్వము, శస్త్రము, శాస్త్రము, వీణ, వాణి, స్త్రీలు, సేవకులు, యజమానుని సామర్థ్యముకొలఁదిని రాణింతురు. అసమర్థుడగు భృత్యుఁడు భక్తుఁడైన నేమిలాభము? సమర్థుఁడైనను ద్రోహివలన ఫలమునున్న. అంతేకాక హానికూడ రాఁగలదు. కావున నో దేవా! భక్తుఁడను శక్తుఁడను నగు నన్నుఁ జేకొనుము. ప్రభు వేమఱినఁ బరిజనులు బుద్ధిహీనులగుదురు. అదిగ్రహించి సజ్జనులారాజ్యమును వీడిపోవుదురు. పెద్దమనుష్యులు లేనిచోట న్యాయము నడువదు. నీతి చెడినతోడనే రాజ్య మస్తావ్యస్తమై నశించును. రాజగౌరవము గలవానిని దేశములోని జనులెల్లరు గారవింతురు. రాజావమానితున కెల్లెడల నవమానమే సిద్ధము. బుద్ధిమంతులు సుభాషితమును బాలునివలననైన గ్రహింపవలయును. సూర్యుఁడు లేనితావున దీప ముపయోగపడుట లేదా?

పింగళకుఁడు:—భద్రా! దమనకా! ఇదంతయు నేమి? నీవు మాకుఁ బ్రధానామాత్యుని పుత్రుఁడవు. తాంత్రికుల మాటలు పాటించి యింతకాలము మాయొద్దకు రావయితివి. ఇపుడు నీయభిప్రాయమేమియో సంశయింపక నుడువుము.

దమన:—స్వామీ! మిమ్ములనొక్కవిషయ మడిగెదను. చెప్పుఁడు! జలము ద్రాగనేగి వెఱఁగుపడిన చందమున జలపానము మాని యేల వెనుదిరిగి వచ్చితిరి? పింగళకుఁడు:— దమనకా! బాగుగ గుర్తించితివి. ఇచ్చట నెవ్వరును బయలు లేరు. నీవును విశ్వాస్యుఁడవు. కావున నీకార రహస్యమును జెప్పె

ద వినుము. ఈ యరణ్యమునఁ గ్రొత్త జంతువు ప్రవేశించినది. ఇప్పు డీచోటు మనము విడువవలసినట్లు తోఁచుచున్నది. నే నొకభయంకరమైన క్రొత్తశబ్దమును వింటిని. ఆధ్వనిని బట్టి యాలోచింప నాజంతువు సామాన్యమయినదని తలంపను. దమన:—దేవా! ఔను. మహాభయహేతువగు శబ్దమును నేనును వినియుంటిని. కాని రాజ్యమువీడి పారిపొమ్మనియు నందు కిష్టములేకున్న యుద్ధము చేయుమనియు నుపాయము చెప్పువాఁ డొకమంత్రి కాఁడు. ఇట్టి సందిగ్ధకాలములందే సేవకుల యుపయోగము గ్రహింపఁదగును. బంధు స్త్రీ భృత్యాత్మల సారాసారము లాపన్నికషపాషాణమునఁ గాంచవలయు నని నీతికోవిదులు వచింతురు. అనిన మృగరా జిట్లనియె. దమనకా! నాకు మిగుల సందేహముగా నున్నది. దమనకుండు:—తనలో, రాజ్యమును వీడి మనరాజు పారిపోనెంచెను గాఁబోలు నని తలఁచి, దేవా! ఈ మీ సేవకుఁడు ప్రాణముతో నున్నంతకాలము మీకొక యాపద రాఁబోదు. కరటకాదులఁగూడ రావింపుఁడు. ఆపత్సమయములందు పరివార మావశ్యకము కదా? అనినఁ బింగళకుఁడు కరటకునిఁ గూడఁ బిలిపించి గారవించె.

పిమ్మట దమనకుఁడు మృగరాజు భయమును దీర్చెద నని ప్రతిజ్ఞచేసి యాతనిమన్ననవడసి కరటకునితోడ నాసవ్వడి వినఁబడిన దిక్కునకుఁ బ్రయాణమాయెను. మార్గమధ్యమునఁ గరటకుండు:—మిత్రమా! భయహేతు వనివార్యమో నివార్యమో తెలియకయే నీ వాతనివలన బహుమానమును గ్ర

హించితివి. ఉపకారము చేయక యెవ్వనివలనను బహుమతిఁ గొనరాదు. రాజునొద్ద గ్రహింపరాదని వేఱె చెప్పనేల? ఎవ్వని ప్రసాద క్రోధములందు సంపన్మృత్యువులు గలవో, అట్టిరాజును మోసముచేయరాదు. బాలునైనను మోసముసేయుట హాని కరమన రాజద్రోహమునుగూర్చి వచింపనేల? భయహేతువగు జంతువు నీ కనివార్యమైనచో నీ వేమిచేయఁగలవు? అనిన దమన కుండు మందహాసముచేయుచు "కరటకా! నీ వూరకుండుము. స్వామికి భయకారణమైనది మఱేదియుఁ గాదు. అది యెద్దు అంకె. ఆవృషభములు మనకుఁగూడ భోజ్యములు. సింగమునకు వేఱె చెప్పనేల?" అనినఁ గరటకుఁడు:—అట్లైన మృగరాజు భయము నచ్చుటనే యేలఁ దీర్పవైతివి?

దమనకుఁడు:—ముందుగనే రాజుభీతి మాన్పిన మనకీ బహుమాన మెట్లు లభించును. అదియునుంగాక

క. నవుకరు ప్రభువునకుందన
యవసరముం దీర్పఁజనదు♦హర్షితమతియై
యవివేకమ్మునఁ గొక్కుం
దవిలి వధించిన బిడాల♦తనయుఁడు సెడఁడే?

నీ కాకథ చెప్పెద నాలింపుము.

## దధికర్ణుని కథ.

ఉత్తరదేశమునం దర్బుదశిఖరమను పర్వతము గలదు. దానిగుహాయందు మహావిక్రముఁడను మృగరాజు వాసము చేయుచుండెను. ఆతఁడు నిద్రించునపు డొకమూషిక నూత ని కేసరములను గొఱికి బొఱియలోఁ దూఱి పోవుచుండెను.

కన్నమునఁ జొచ్చినయెలుకను బట్టునుపాయముఁ గానక యీ కేసరి విక్రమవంతులగు మనబోంట్లకు సాధ్యము గానపుడు వారికిఁ దగుసైనికుని బోషింపవలయు నని చింతించి దధికర్ణుఁడను బిడాలమును బట్టితెచ్చి తనయొద్దనుంచుకొని తాను భుజించునాహారములోఁ గొంత దానికిచ్చి పెంచుచుండెను. పిమ్మట మూషికము పిల్లిభయమున కలుఁగునుండి యీవలకు రాకుండెను. మృగరాజునకు మూషికోపద్రవము తొలఁగెను. కలుఁగులో మూషికశబ్దము వినఁబడినపుడెల్ల సింహము మార్జారమునకు మఱింత యాహారము నిచ్చుచుఁ బోషించుచుండెను. ఒకనాఁడు మూషిక మాఁకలిఁ గొని యాహారమునకై బయట సంచరింపఁబోయెను. దధికర్ణుఁడు దానినిబట్టి భక్షించివైచెను. పిమ్మట సింహము చాలరోజులు మూషికము కానరాకుండుటయు దానిశబ్దమైన వినరాకుండుటయుఁ జూచి యెలుక చచ్చినదని గ్రహించి పిల్లి కాహారమీయక యుపేక్షించె. కావున 'సేవకుఁడు స్వామికిఁ దన యవసరము పూర్తిగఁ దీఱునట్లు చేయరాదు' అని నుడివితిని.

ఇట్లు వారు సల్లాపము లాడుచు సంజీవకుని సమీపమున కేగిరి. కరటకుఁ డొకచెట్టుక్రింద సాటోపముగఁ గూర్చుండెను. దమనకుఁడు సంజీవకుని సమీపించి "ఓరీ వృషభా! ఈ దేశపురాజగు పింగళకునిచే నీయరణ్యరక్షణార్థము నియోగింపఁబడిన సేనాపతియగు కరటకుండు నిన్ను రమ్మని యాజ్ఞాపించుచున్నాఁడు. వచ్చెదవా రమ్ము! లేకున్న సత్వరంబుగఁ బారిపొమ్ము. కాదేనిఁ దగినఫలము ననుభవింతువు. సేనాపతి

చాల కోపముతో నున్నవాఁడు. ఏమియాజ్ఞాపించునో తెలి యదు" అనిన సంజీవకుండు క్రొత్తవాఁడు కావున భీతుఁడై వచ్చి కరటకునకు సాష్టాంగముగ నమస్కారమొనర్చి "సేనా పతీ! యాజ్ఞాపింపుము. నీ యాజ్ఞకు లోఁబడితిని." అనెను. కరటకుఁడు "ఓరీ వృషభా! నీ వీ వనంబున వసింపందలంచితి వేని మా రాజు పాదంబులకు మ్రొక్కుము" అనెను. సంజీవకుఁడు రాజనియుక్తులారా! నా కభయమిండు. మీ వెంటవచ్చెదను. అనినఁ గరటకుఁడు "బలీవర్ధా! వినుము. నీకు సంశయము వలదు. శిశుపాలుఁడు పలుసారులు తిట్టినను వాసుదేవుఁడు మఱలఁ దిట్టె నా? సింగము నక్కకూఁతలకుఁ బ్రతిధ్వనులిచ్చునా? మహా వాత మున్నతభూజములను భంజించుంగాని వినతములగు తృణములఁ బెకలింపదు. కావున మా స్వామి వినతుఁడవగు నీ కెగ్గుసేయఁడు" అనియె. సంజీవకుఁడు ధైర్యమునొంది వారి వెంట నరిగెను.

కరటక దమనకులు సంజీవకుని వెంట నిడికొనిపోయి కొంత దూరమున నిల్పి తా మేగి మృగపతిని గాంచి నమస్కరించి నిలిచిరి. పింగళకుఁడు చూచి "ఏమి! మీ కా జంతువు కానవచ్చె నా?" యనిన దమనకుండు "దేవా! కనుంగొంటిమి. వినీతునిఁ జేసి మీ సాన్నిధ్యమునకుఁ గూడఁ దీసికొనివచ్చితిమి" అని చెప్పెను. పింగళకుఁడు దమనకా! ఆజంతువు మిగుల బలవంత మైనదా యేమి? యని యడిగిన దమనకుం డిట్లనియె. దేవా! ఔను. ఐన నేమి? మిమ్ముల దర్శింపనెంచి వచ్చియున్నవాఁడు. మీరు బింకముగఁ గూరుచుండుఁడు. జలమున సేతువును,

తంత్రమున స్నేహమును, మాటలచేఁ బిఱికివానిని భేదింపవలయును. వాని గర్జనమునజనించిన భీతిని వీడుఁడు.

క. భీతి వహింపఁగ వలవదు
హేతువు తాఁ దెలిసికొనక యే ధ్వనిమాత్రన్
నాతి యొకర్తుక జనతా
భీతిం దొలఁగించి కాంచె విభు గౌరవమున్.

మీఁకాకథ వినిపించెద వినుండు.

ఘంటాకర్ణుని కథ.

శ్రీపర్వతంబను నొక శైలముచెంతఁ గాంతార ప్రాంతమున బ్రహ్మపురంబను పట్టణంబు గలదు. ఆ పట్టణమున వసించు ఘంటాకర్ణుఁడను జంగ మొకఁడు భైక్షార్థము వనమార్గమున సమీపగ్రామమున కేగుచుండ మార్గమున వాని నొక వ్యాఘ్రము చంపి భక్షించె. వాని హస్తగతమగు గంటను దత్ప్రాంతమునఁ జరించు వానరులు గ్రహించెను. ఘంటాకర్ణుఁడు పులిచేఁ జచ్చుటను వ్యాఘ్రభక్షితావశిష్టమగు నాతని మృత దేహమును గాంచి పౌరులు గ్రహించిరి. కోఁతు లాఁగంటను వాయింపగా నాశబ్దము రాత్రులందు వినంబడుటచే ఘంటాకర్ణుఁడు భూతమై గంట వాయించుచు నరణ్యమునఁ జరించుచుండెననియు మార్గమునఁ బోవు మానవులఁ బట్టి భక్షించుచుండెననియుఁ బ్రవాదము బయలు వెడలెను. అపు డపుడు ఘంటానాదము విని జనులు భీతులై యా పట్టణమును వీడి పాఱిపోవఁ జొచ్చిరి. ఆ నాదమునకు హేతు వొక వృద్ధవేశ్య గ్రహించి రాజునొద్ద కేగి

రాజా! ధనవ్యయమున కంగీకరించితి రేని పురప్రాంతమునం జరించు ఘంటాకర్ణ గ్రహమును బారందోలెద ననిన రాజు సంతసించి యామెకుం జాల ధనం బొసంగె. పిమ్మట నది ఫలబీజాదులను గొనిపోయి మర్కటముల కెర వేసెను. అయ్యవి చేతనున్న గంటను బాఱవైచి యాహారమును భుజింప నారంభించినవి. ఆ సమయమున నావృద్ధ గంటను దీసికొని గృహమునకుం దిరిగివచ్చి గ్రహమును బాఱందోలితి నని చెప్పెను. నాంటినుండియు ఘంటారవము వినంబడకుండుటం బట్టి గ్రహమును దోలిన మహామాంత్రికురాలని యావృద్ధను నగరజనులు పూజించుచు వచ్చిరి. కావున భయహేతువు లేకయే శబ్ద మొకప్పుడు కలుగవచ్చును. శబ్ద మాత్రమునకు భయము నొందరాదని వచించితిని. ఇట్లు చెప్పి సంజీవకుని రావించి రాజ దర్శనము చేయించె. మృగరాజును బ్రీతుండై సంజీవకుని దన సేవకులలో నొక్కనింగ నంగీకరించె. సంజీవకుండు సంప్రీత చేతసుండై యాతని చెంత వాసముచేయు చుండె.

ఇట్లుండం బింగళకునింటికి నాతని సోదరుండగు స్తబ్ధ కర్ణుండు వచ్చెను. పింగళకుండు తమ్ముని గారవించి కూర్చుండ నియమించి యాతని యాహారమునకై మాంసమును దేం బూని వనమునకుం బయనమయ్యెను. అట్టితఱి సంజీవకుం డిట్లనియె. దేవా! నేండేగదా మృగయావినోదము సల్పి సుసమృద్ధ మగు మాంసరాశిం గొనివచ్చితిరి. ఆ పలలమంతయు నేమ య్యె? ననిన మృగేంద్రుండు కరటకదమనకు లెఱుంగుదురని

చెప్పె. అందుకు సంజీవకుండు "అట్లయిన వారింబిలిచి విచారింపరాదా?" అనుటయుఁ బింగళకుండు చిరునగవు మొగమునఁ దోఁలఁకాడ "నయ్యది వ్యైపోయినది. మదుపార్జితమైన పలలమును నాదుసేవకులు కరటకదమనకులు తమకుఁ గావలసినది భుజించి మిగిలినది తమబంధువులకుఁ బంచిపెట్టుకొనిరి. ప్రత్యహము నిదియే పనిస. నాదుసేవకులే నన్నిట్లవమానించుచున్నారు. అనిన సంజీవకుండు "దేవా! ఇది సేవకునకుఁ దగదు. రాజున కెఱింగింపక స్వతంత్రించి యుపజీవియేకార్యమును జేయరాదు. గవ్వచేతికిచ్చిన దానిని లక్షచేయువాఁడే మంత్రి. రాజునకు ధనమే ప్రాణము. అట్టిధనమును మంత్రియగువాఁడు దుర్వ్యయము చేయరాదు. ధనము చేతవలెఁ గులాచారాదులచే నరుఁడు పూజ్యుఁడుకాఁడు. ధనవిహీనుని భార్యయు నలక్ష్యము సేయును. రాబడిని గ్రహింపక వ్యయముసేయుచుండినఁ గుబేరునంతవాఁడైన దరిద్రుఁడగును. అనిన విని పింగళకునిసోదరుండగు స్తబ్ధకర్ణుం డిట్లనియె.

సోదరా! ఈ కరటక దమనకులు చిరసేవకులై యున్నారు. వీరు సంధివిగ్రహ కార్యోద్యోగులు. వీరికిఁ గోశాధికారమెన్నఁడు నొసంగరాదు. కోశాధికారము విషయమున నేను విన్నయర్థముం జెప్పెద వినుము.

బ్రాహ్మణ క్షత్రియులకును బంధువునకును ధనపుకొట్లనప్పగించుట మేలుకాదు. బ్రాహ్మణుఁడు వేళకు ధనమీయక బాధించును. క్షత్రియుఁడు ధనమడిగిన యజమానునకే

కత్తి చూపును. బంధువు తన చుట్టరికమును బురస్కరించు కొని యా ధనమును దాను భక్షించుటకు మొదలిడును. చిరసేవకున కా యధికార మిచ్చిన నపరాధము గావించియు జంకఁడు. ఉపకారికిఁ గొట్టు పెత్తనమిచ్చినఁ దా నొనర్చిన యుపకారమును బ్రకటించుచు సర్వార్థమును సంగ్రహించును. రా జెన్నఁడును మంత్రులతోఁ నాటలాడరాదు. పరిచయ మధికమగు కొలఁదిని సేవకులు యజమానుని జులకఁగఁ జూతురు. ఈ యర్థమును గుర్తెఱింగి రాజు వ్యవహరింపవలయును. చిర పరిచితులని వీరి యాజ్ఞాభంగములను క్షమింపరాదు. ఆజ్ఞాభంగ మొనర్చిన సుతునైనఁ బ్రభువు దండింప వలయునన్న నితరుల సంగతి చెప్పనేల? స్తబ్ధుని యశము, అర్థపరుని ధర్మము, వ్యసని విద్యాఫలము, ప్రమత్త సచివుండగు నరాధిపుని రాజ్యము నశించునని నీతిశాస్త్రజ్ఞులు వచింతురు. అన్నా! నాదువాక్యము నాలింపుము. నేఁడు నేను భోజనము చేసి వచ్చితిని. ఇపుడు నా కాహారము వలదు. నీవు మాంసార్థము పోవలదు. ఇంక సస్యభక్షకుండగు సంజీవకుని భోజనాధికారమున నియోగింపుము. అనినఁ బింగళకుఁడు తమ్ముని యభీష్టము చొప్పున స్వబాహుబలోపార్జిత విత్తరాసులగు పలలరాసులను రక్షించు నుద్యోగమునుండి కరటక దమనకులను దప్పించి యా కార్యము సంజీవకున కిచ్చె. సంజీవకుఁడు మాంసాహారి కానందున రాజధనంబు సురక్షితమై యుండె. దమనకాదుల యాటలు ముందువలె సాగవయ్యె. అప్పుడు కరటక దమనకు లొక

చోటఁజేరి యిట్లు చింతించిరి. దమనకుఁడు:—కరటకా! దుష్టుఁడగు సంజీవకున కుపకృతి సేయఁబోయిన మనకపకృతి యెదురయ్యె. మనవలె మునుపొక జంబుకము వ్యాఘ్రమునకుపకారము సేయఁబోయి హానిఁజెందెను. అనినఁ గరటకుఁడు:—ఏ జంబుకుఁడు పులికి మేలు సేయఁబోయి హానివడసెను. ఆ కథ నాకెఱింగింపు మనుటయు దమనకుం డిట్లనియె.

పూర్వము మృగదుర్గమను మహారణ్యము మధ్యమున నొక కొండగుహయందు నధీరుఁడను వ్యాఘ్రపతి వాసము చేయుచుండువాఁడు. ఆతఁడొకనాఁ డాహారమునకై అరుగ వనమునకేగెను. అట్టి సమయమునఁ గారుమేఘములు గ్రమ్మి గొప్ప గాలి వాన పట్టెను. ఆ గాలిచేఁ దత్ప్రాంతమున మేయుచున్న మేఁకలమంద చెల్లాచెదరయ్యెను. అంత జీఁకటి పడుటయు నా మేఁకలమందలోని చీఁబోతు త్రోవదెలియక నెమ్మదిగ నధీరుని నివాసమైన కొండగుహనుజేరి యందు వసించెను. అంత నధీరుండును వానచేఁ గొట్టుపడి వడఁకుచు స్వగృహమును సమీపించి లోపలకుఁ బోవ నట నల్లని మేని తో మూరెడు గడ్డముతో సూదులవలెవాడియైన కొమ్ములతో నెలుగుబంటివలె శరీరమునిండ బొచ్చుతో మిడిగ్రుడ్లతోఁ జూడ భయంకరమైన యొకవ్యక్తి గానవచ్చెను. అంత నధీరుఁడు దిగులుపడి యీ వింతజంతువు నెన్నఁడును జూచి యెరుగఁడు గావునఁ దనకంటెఁ గ్రూరమైన జంతు వేదియో తన యింటి నాక్రమించెనని శంకించి వెనుకకుఁ బాఱిపోవుటకును దానిపైఁ బడుటకును దోఁచక నిలువఁబడెను.

అంత నా చీఁబోతు దాని భావమును గనిపట్టి పులితో నిట్లనియె. రా! రమ్ము! ఇంక నెక్కడి కేగెదవు? నీ కొఱకే వచ్చితిని. నేఁటికి నావ్రతము పూర్తియైనది. నా వ్రతముచొప్పున నూఱు గజములను జంపి భుజించితిని. నూఱు సింగములను సంహరించితిని. తొంబది పులులు కూడఁ జేకూరినవి. ఇఁక నిన్నుంగూడ భుజించితి నేని నా యీగడ్డము దీసి వేయవచ్చును. నా యదృష్టము మంచిది. నా వ్రతము శీఘ్రకాలముననే ముగిసినది.

ఈ మాటలు విని నంతనే యీ బెబ్బులికి గుండె చెదరెను. ఇఁక నేమున్నది? తాను మృత్యుదేవత నోటిలో స్వయముగఁ బడితినని తలంచెను.

ఇట్టి భయంకర మృగము బాఱినుండి తప్పించుకొనుట యసాధ్యమని తలంచి దిగ్భ్రమము నొందిన మానసముతోఁ దటాలున వెనుకకుఁ దిరిగి యదేపోకగాఁ బాఱిపోయి యొక పర్వతము నొద్దనున్న పెద్ద ఱాతిచాటునఁ గూరుచుండి యీ మృత్యుదేవత తనను వెన్నాడి వచ్చుచున్న దేమో యని యాదిక్కునకే చూచుచుండెను. ఇంతలో నొక కుశాగ్ర బుద్ధియను నక్క యటకు వచ్చి పులిని జూచి,

నక్క:—రాజా! నమస్కారము.

పులి:—(అదరిపడి గట్టిగ మాటలాడ వలదని హస్త సంజ్ఞ చేయుచు నెమ్మదిగా) రా! ఇటురమ్ము.

నక్క:—(సమీపించి నెమ్మదిగా) దేవా! ఏమది యట్లు భయపడుచున్నావు?

పులి:—ఏమఁ జెప్పను ? ఈ రోజున నేను పునర్జన్మ మెత్తితిని.

నక్క:—(ఆశ్చర్యపడుచు) ఏమియంత యాపద ?

పులి:—ఆపద గాదు మహాపద. ఇంతకుముందు వర్షమునకుఁ దడిసి నాదు నివాసమగు పర్వతగుహను జేరితిని. ఇఁక నేమున్నది ! మృత్యుదేవతయే. యచ్చటఁ బ్రత్యక్షమైనది. అబ్బా ! అబ్బా ! ఒడలు గడి పొడుచుచున్నది. నల్లని దేహము సూదులవంటి కొమ్ములు పెద్ద గడ్డము దేహమంతయు వెంట్రుకలు మిడి గ్రుడ్లు ! నే నిన్ని జంతువులను జంపితిఁగాని నా కెన్నఁడు నింత భయము జనింపలేదు. అహాహా ! ఏమి యాకృతి ! ఏమి క్రౌర్యము! క్షణము తప్పినది. లేకున్న నీపాటి కేమయియుండునో ? నూఱు సింహ సింహములను నూ ఱేనుఁగులను నూఱు పులులను జంపెదనని వ్రతముఁ బూనినదఁట. ఒక్కపులి తక్కువగా వ్రతము ముగిసినదఁట. నన్నుఁ గడతేర్చి వ్రతసమాప్తి వడసెదనని నాపైఁ బడఁ రాఁగా నాకాలిబలముఁ జూపితిని. ఇంకను మీయట్టి సేవకుల నేలు భాగ్యము నా కున్నది కాఁబోలు. ఆ దృశ్యమును వర్ణింప నాకు సామర్థ్యము చాలదు. నేనింత ధైర్యశాలిని గావుననే దాని యాకారమును గాంచి పాఱిపోయి రాఁగల్గితిని సామాన్యులైన నచ్చటనే పడి జీవములు వీడియుందురు. కుశాగ్రబుద్ధీ! చూచితివా? నేఁటిదినమహిమ!

నక్క:—(లోలోన నవ్వుకొనుచు) రాజా ! మీరు చెప్పిన లక్షణములను బట్టి చూడఁగా నయ్యది యొక మేఁక

పోతుగా నుండవలయును. మీ రట్లు భయపడుటకుఁ దగిన హేతువు గనుపడదు.

పులి:—ఛీ నోరు మూయుము. మేఁకలను నే నెఱుంగనా? నాకంటే మహా ధైర్యశాలివలె మాటలాడుచున్నావు. నీవు స్వయముగఁ జూచిన యెడల నిట్టి మాటలు చెప్పవు.

నక్క:—వ్యాఘ్రోత్తమా! కోపింపకుము. ఈప్రాంతమున నీ రోజున నొక మేఁకలమంద సంచరించు చున్నది. దానిలో తాము సెలవిచ్చిన లక్షణములు గల మగమేఁకలు గొన్ని గలవు. నేను బాగుగఁ జూచితిని. ఈగాలివానకుఁ జెదరి యొక చీఁబోతు మీగృహమును జొచ్చియుండును. దానిని జూచి మీరు భయపడియుందురు. అంతియె కాని యది తమ కంటె పెద్దజంతువు కాదు.

పులి:—సరి సరి! అది మేఁకపోఁతు కాదు. మేఁకయే యైన నూరేసి సింహగజవ్యాఘ్రములను జంపెదనని వ్రతము నేలపూనఁ గలదు. పూనును పో! దానికా కార్యము సాధ్యమగునా?

నక్క:—అది యంతయు సర్వము కల్ల మిమ్ము ను వెఱపించుటకా మాయలమాఱి యట్లు చెప్పియుండును. నిజముగ నట్టివ్రతమే యున్నచోఁ దమముందరఁ దన ప్రజ్ఞలన్నియు వల్లించుకో నేల? దానిని బట్టి తప్పక యా జంతువు మీకు భయపడి తమను బెదరించుట కట్లు చెప్పియుండుటసత్యము.

పులి:—ఏమీ! ఎంత చోద్యము! నిజముగ నయ్యది మేఁకయే యై యుండునా? అట్లైనచో నచ్చటనే యా జంతు

వును జప్పరించి వేయక పోవునా? కాదు కాదు నిజముగా నయ్యది యేదియో క్రూరజంతువే. సందియము లేదు.

నక్క:—వ్యాఘ్ర పుంగవా! భయపడకుము. నిన్ను వెఱపించిన యా జంతువు తప్పక మేఁకపోఁతే. నేను గూడ సాయము వచ్చెదను పదము.

పులి:—సరి గాలికి గడ్డపారలు గొట్టుకొని పోవుచుండ పుల్లియాకుల గతి యడుగవలయునా? నీవు సాయము వచ్చి నాకేమి యుపకరించెదవు? నన్నుబట్టి యా ధూర్తమృగము మ్రింగఁబోవ నీవు తోఁకముడిచికొని పాఱిపోవుదువు గాఁబోలు.

నక్క:—హరి హరి! ఎంత మాటాడితిరి. నేనంత విశ్వాసద్రోహినిగాను. చేత నగువఱకు సాయపడుటయు శక్తి చాలక శత్రువున కోడిపోవలసి నపుడు దేవర పాదముల ననుసరించి పరలోకమున కరుగుటయు మాకుఁ గులవ్రతము. అంతియ కాని బలవంతుఁడై నశత్రువునకుఁ బ్రభువు నప్పగించి పిరికి పందలై యిహపరములకుఁ జెడి పాఱిపోయి యశమును మలీమసము చేసికొని జీవించువారు మా కులమున లేరు. మా వంగడమునకు వంచక నామధేయము నేతి బీరకాయ వంటిది. సిద్ధమైన యాహారము విడువకుఁడు. నా వెంట విచ్చేయుఁడు. అయ్యది యీ గాఢాంధకారములో వెడలిపోవఁజాలదు. మనము పోవునంత కచ్చటనే యుండును. ఇంకను నన్ను నమ్మరేని మీకును నాకును తోఁకలతో దృఢముగ లకె వేయుఁడు. మీరు జయించిన నేనును జయింతును. మీ రోడిన నేనును బరాజితుడనై శత్రువుచేతఁ జిక్కుదును.

పులి:—సరి యట్లైన నట్లు కానిమ్ము వచ్చెదను. మన కిరువురకును లంకె వేయుము.)

నక్క:—(పరమానందముతోఁ దీఁగలను దెచ్చి దృఢముగఁ బులిమెడకును దన కంఠమునకును లంకె వైచెను.)

వ్యాఘ్ర జంబుకములు రెండును పర్వతగుహా కభిముఖముగ బయలు దేరినవి. నక్క ముందునకు లాగును. పులి వెనుక కీడ్చును. ఇట్లా రెండును నడిచి కొండగుహను జేరినవి. అంత వీనినిగాంచి చీఁబోతు భయమునొంది యీ సారి తన టక్కరిమాటల నీజంబుకము సాగనీయదని తలంచియుఁ గొంత ధైర్యము దెచ్చికొని మందహాసము సేయుచు నక్కవైపుచూచి యిట్లనియె. "ఔరా! సేవకా! ప్రజ్ఞయనఁగనీయది! పాఱిపోయిన పులిని గట్టి తీసికొని వచ్చితివి! త్వరగాఁ గొనిరమ్ము. నీకై యెదురు చూచుచుంటిని. ఇట్టులే నా వ్రతమును బూర్తిసేసితివి. నేఁడు నీకును నాకునుగూడ పులి మాంసము సమృద్ధి. పాఱిపోయిన పులులను బట్టుటలో నీయట్టివాని గానము. నౌకరన నీయట్టివాఁడుండవలయును" ఈమాటలు పులివినెను. కెవ్వన నొక కేకవైచి వెనుకకుఁదిరిగి పరువెత్త నారంభించెను. అంత నక్క నేదియో చెప్పఁబోయెను గాని దానిమాట వినువారెవ్వరు? వ్యాఘ్రమునకు దిగ్భ్రమ జనించెను. "ఔరా వంచకా! యెంత మోసముచేసితివి! ఇందులకా నన్నింత బలవంతముచేసి తీసికొనివచ్చితివి. చాలు చాలు నే నప్పుడే సందేహము పడితిని" అనుచు రివ్వనఁ బరువెత్త దాని మెడలోఁ గట్టఁబడిన బండవలె నక్క వ్రేలాడుచు

నేలమీఁద నీడ్వఁబడి ముక్కలు ముక్కలై మృతినొందె. పులి మఱియొక వనమునకుఁ బాఱిపోయె. మేఁకయు బ్రదుకుజీవుఁ డాయని యెట్టెట్టో తెల్లవారుదాఁక నచ్చటఁ గడపి పిదపఁ దననివాసమును జేరి సుఖముగ నుండె. కాఁబట్టి క్రూగుల కుప కారము సేయఁబోయినఁ దుదకు వారికే యపకారమగును.

ఇట్లు స్వాపరాధమున జెడినవారము మన మేకాము పూర్వమొక రాజకుమారుండును. మనవలెనే స్వాపరాధ మునఁ జెడెను. వాని కథ నుడివెద వినుము.

## పరివ్రాజకుని కథ.

సింహళద్వీప భూపాలుని పుత్రుఁడు దర్పకేతుఁడను వాఁడు గలఁడు. సముద్రయాన మొనర్చివచ్చిన వర్తకుఁడొకఁ డాతనియొద్దకేగి "రాజా! మొన్నటి చతుర్దశినాఁడు నేను సముద్రయాన మొనర్చు చుండఁగా నా యునధి మధ్యమున నొక కల్పపాదపము గానవచ్చె. దాని క్రిందిభాగమున రత్న మయ వేదికపై నొక సుందరాంగి గూరుచుండి వీణ వాయిం చుచున్నది. ఆపె మమ్ముఁజూచి యావృత్త సహితముగ సము ద్రము నడుమున మునింగిపోయె. మేము దూరమైన కొలఁదిని నా మెయథా పూర్వముగ నుండెను" అని విన్నవించెను. అది విని యా రాజ కుమారుండు కుతూహలాయత్తచిత్తుఁడై యా వణిజునినే మార్గము చూపుమని యాతని యోడపై నెక్కి యటకేగ నా సుందరి వారింగాంచి మునుపటివలె సాగర మున మునుంగ మొదలిడెను. అంతే నా రాజకుమారుఁడు నావపైనుండి సముద్రమున దుమికి మునుంగుచున్న కల్ప

వృక్షము శాఖ నవలంబించెను. అంత నాతఁడు కనులు విప్పు నప్పటికి విద్యాధర లోకమునఁ గనక పత్తనమునొక పుర మున స్వర్ణమయ ప్రసాదమున వశించుచుండెను. ఆతఁడు గాం చిన సుందరియు నామె డయుండె రత్నమయాసనమునఁ గూరు చుండి యుండెను. అంత నామె చెలి యెకర్తు వచ్చి యారాజ కుమారునితో నిట్లనియె.

ఈమె మాచెలి విద్యాధరరాజగు కందర్పకేళికిఁ దనూజాతయగు రత్నమంజరి. మొట్ట మొదట నీ పట్టణమును గాంచిన రాజసుతుని బరిణయమాడెదనని ప్రతిన వట్టినది. నీ వీ సుందరిని బరిణయ మాడుమనుటయు నాతఁడు తన సాహసము ఫలించినందుల కపరిమితానంద భరితుండై యా కాంతను బరిణయమాడి సుఖముగ దినములు గడపుచుండెను. అంత నొకనాఁడు రత్నమంజరి దర్పకేతునిం గాంచి "ప్రాణ వల్లభా యీ రత్నప్రాసాదము మదధీనము. ఇట సర్వపదార్థ ములు నీవు గ్రహింపవచ్చును గాని యీ పటమునందలి స్వర్ణ రేఖయను విద్యాధర సుందరిని మాత్రము ముట్టవలదు" అని నుడివెను. అందుల కాతఁడు సరియని చెప్పి యామె పరోక్ష మునం దా బొమ్మను దాకిన నేమగునో చూచెద నని యా ప్రతిమపైఁ జేయివైచెను. ఆహా! ఏమి చిత్రము! ఆబొమ్మ సప్రాణయగు యువతి చందమున నాతని నొక తన్నుదన్నెను. తోడనే యాతఁడు మూర్ఛపడెను. కనులు తెరచు సరికాతని రాజ్యమున నుండెను. పిదప నాతఁడు రత్నమంజరికై దుఃఖించి దుఃఖించి రాజ్యము విడిచి సన్యాసము స్వీకరించె. మనముసు

నా విధముననే స్వాపవాధమునఁ జెడితిమి. మొట్టమొదట వీనిఁ జేర్చుట మన దోషము ఇపుడు విచారపడిన ఫలము లేదు. చిత్రకర్మ నిపుణులు సమప్రదేశమునందు మెరక పల్లముల గనుపఱచునట్లు బుద్ధిమంతులు సత్యము లసత్యములుగాను, అసత్యములు సత్యములుగాను ప్రదర్శింపఁజాలుదురు. చూడుము! ఇపుడు నాదు బుద్ధిచాతుర్యమున వీరిరువురకును గలహాము వెట్టెదను. అనినఁ గరటకుం డిట్లనియె. ఔను నీవు వచించినది సత్యమే. కాని యీ పింగళక సంజీవకులకు మైత్రి మిగుల దృఢపడినది. అయ్యది భేదింపఁ దరమగునా? యనుటయు దమనకుండు కరటకా!

క. కాకమ్ము కనకసూత్రముఁ
గైకొని తా నాగుఁబాముఁ • గడ తేర్పదొకో?
నీ కాకథ చెప్పెద విను
లోకమ్మున బుద్ధిసాధ్య • లోపము గలదే?

కాకనాగీయము.

ఒకతరువునందు కాకదంపతులు వాసము చేయుచుండెను. ఆభూరుహముక్రింది వల్మీకములోఁ గృష్ణసర్పమొకటి నివసించుచు నా కాకుల గ్రుడ్లను దిని పోవుచుండెను.

ఇట్లుండ నాఁడువాయసము పెనిమిటితో నిట్లనియె. నాథా! మనయండములఁ దడవులంబట్టి యీపన్నగము మ్రింగివేయుచున్నది. ఇచ్చటనున్న మన సంతానము వృద్ధినొందఁజాలదు. "దుష్టయగుభార్య, శఠుఁడగుమిత్రుఁడు, ఎదురాడుసేవకుఁడు, సర్పమునసించుగృహము, మృత్యుప్రాయములు" అని

యనుభవశాలులు వచింతురు. ఇపుడు నాకుఁ బ్రసవకాలము సమీపించినది. అనినఁ బురుషకాక మిట్లనియె. ప్రియా! భయపడకుము. ఇంతవఱ కీవిషవక్త్రుని యాగడము సైచితిని. ఇఁక క్షమింపను. బలవంతుఁడగు నీ క్రూరునితోఁ బోరఁగలవా? యని శంకింపకుము. శరీరబలముకంటె బుద్ధిబలము గొప్పది. ఒకశశ ముపాయమున సింహమును సంహరించె నీకాకథ వివరించెదను వినుము.

తే.గీ. దేహబలముకంటె♦నూహబలము గొప్ప
యిందు సందియం బొ♦కింత లేదు
శశ ముపాయమునను♦జంపెను సింగంబుఁ
జెప్పెదఁ గథ నీకుఁ♦దెలియ! వినుము.

శశక సింహముల కథ.

మందారపర్వతప్రాంతారణ్యమున దుర్దాంతమను సింగము గలదు. అయ్యది మృగముల నొక్కపెట్టున మారణము సేయుచుండెను. అపుడు జంతుజాలంబెల్ల భయార్తమై యేకీభవించి యాసింగమునొద్దకేగి “రాజా! మమ్మందఱ నొక్కసారిగ నేలచంపెదవు? నీకు దినమున కొక్కరుచొప్పున నాహారముగ వచ్చెదము. వానిని భక్షించి తక్కినవారిని రక్షించుచుండుము” అని వేడుకొనిన మృగేంద్రం డందుల కంగీకరించె. అదిమొదలు ప్రతిదినము వంతుచొప్పున నొక మృగము కేసరి కెరగఁ బోవుచుండెను. ఇట్లుండ నొకనాఁడు చవులపిల్లికిఁ బోవలసినవంతు వచ్చెను. అయ్యది పోవక తీరనందున బయలుదేఱి. పోవుచు, “బ్రదుకఁగోరువాఁడు బల

వంతునకు వినీతుఁడై యుండవలయును. ఇపుడు మృతినొందు నాకు సింగముమన్నన యేల ? ఈఁతకుమిక్కిలిలోతును జావునకు మిక్కిలి కీడును లేవుగదా? ఈసింగము నన్నెట్లును జంపక మానదు. అంతకంటె నన్నేమిచేయును. కావున నెమ్మదిగనే పోయెద" నని చింతించుచు మందగమనమున సింగముపాలి కేగెను. అపుడు సిగము కోపించి యింతయాలస్యమేలచేసితి వన నా శశమిట్లనియె. దేవా! ఇందు నాదోష మించుకయు లేదు. మార్గమున సింగమొకటి నన్నడ్డుపెట్టి పట్టి భక్షింప సమకట్టె. అపుడు "నేను మృగరాజున కాహారముగఁ బోవుచుంటిని నన్ను ముట్టవలదు" అని చెప్పితిని. ఆమాట కాతఁడు గ్రుఁడై "యీవనమున నేనుగాక మఱియొకఁడు మృగరాజు గలఁడా! నీవు తక్షణమేగి వాని నిట గొనిరమ్ము. మాయిరువురలో నెవ్వఁడు మృగరాజో నీవె చూతువుగాని" అని పంప దేవర సన్నిధానమునకు వచ్చితిని. ఆతఁడు నన్నడ్డగించుటచే నింత తడయవలసి వచ్చె. అనిన దుర్దాంతుఁడు మండిపడి "ఔరా! ఏమి వానికావరము! శీఘ్రుంబ వాని నాకుఁ గానిపింపుము. నాదు నిశితనఖాగ్రముల నాత్రుముక్కడిని బట్టి ఖండ ఖండములు గావించి వానిమృగరాజత్వమును వ్యక్తీకరించెద" ననిన శశ మాదుర్దాంతుని వెంటఁగొనిపోయి యగాధమయిన యొకకూపమును జూపి దేవా! ఆక్రూరుం డందుఁ గలండు చూడుమన నాసింగము కూపోదకమున దన నీడను గాంచి యదియె తనశత్రువని తలంచి గుహాలు ప్రతిధ్వనించునట్లు గర్జించుచు నాయగాధ కూపజలంబుల దుమికి

మృతినొందెను. కావున నుపాయమున నీ మహాసర్పమును సంహరింపవలయును. ఈప్రాంత సరోవరమున రాజపుత్రికలు తమ యాభరణములను దీసి యొడ్డుపై నుంచి యపుడపుడు జలవిహారములు సల్పుచుందురు. ఆ సమయమున నాయలంకారములం దొకదానిని నోటఁ గఱచుకొని వారు గాంచునట్లు వచ్చి యీపుట్టలోఁ బడవేయుము. పిమ్మట మన యభీష్టము నెఱవేఱును. అనిన నాఁడుకాకి మగని మాటచొప్పున నొక కనకసూత్రము ముక్కునఁ గఱచుకొని వారుచూచుచుండఁగనే యావల్మీకవివరమునఁ బడవైచెను. అనంతరము రాజప్రేరితులగు భటులువచ్చి యా పుట్టను ద్రవ్వి సర్పమును మడియించి స్వర్ణసూత్రము నెత్తికొని పోయిరి. కావున నుపాయమునకు సాధ్యముకానికార్యము లేదని చెప్పితిని. అనినఁ గరటకుండు సరి అట్లైనచోఁ బోయిరమ్ము. నీకు జయము చేకూరుఁగాత! అని చెప్పిన దమనకుండు నెమ్మదిగఁ బింగళకుని సమీపించి నమస్కరించి దేవా! దేవరకొకకార్యము విన్నవింపనేతెంచితిని. ఆపద రానున్నపుడును, కార్యము మించిపోవునపుడును భృత్యుఁడు రాజడుగకున్నను జెప్పవలయును గదా? రాజు భోగములకుభాజనము గాని కార్యధూర్వహుఁడు కాఁడు. ప్రభుని కార్యములు చెఱచు సేవకుఁడు మహాపాపము నొందును. స్వామిపదవి నాక్రమింపఁగోరు దుర్మంత్రికి మరణశిక్ష తప్ప వేఱుశిక్ష విధింపరాదు. అనినఁ బింగళకుండు "దమనకా! నీవు వచ్చినకార్యము సంశయింపక నివేదింపుము." అనెను.

దమనకుఁడు రాజా! సంజీవకుండు గొప్పయుద్యమ

ముతో నున్నవాఁడు. మాయొద్ద సర్వదా మిమ్మును, మీసా మర్థ్యమును దూషించుచుండును. ఆతఁడు తమరాజ్యమును హరింపఁ గోరుచున్నవాఁడు. అనిన విని పింగళకుఁ డాశ్చర్యము నొంది యూరకుండెను. దమనకుఁడు దేవా! సర్వామాత్యులఁ బరిత్యజించి యీతనికి సర్వాధికార మిచ్చితిరి. ఇది చాల పొరపాటు. ఒకయల్పునిం బిలిచి మంత్రిపదవి నొసంగిన తోడనే వానికి మద మధికమగును. మదము హెచ్చినకొలఁదిని స్వాతంత్ర్యేచ్ఛ జనించును. అట్టివాఁడు స్వామికిఁ బ్రాణద్రోహ మాచరించును. విరక్తుఁడగు సేవకుని, కదిలినదంతమును, దుష్టుఁడగు నమాత్యుని మూలోద్ధరణము సేయుట మేలు. సర్వసంపదను సచివునియధీన మొనర్చిన రాజు వానితోడ ద్వేషము కల్గినపుడు గ్రుడ్డివానివలె వ్యవహారానభిజ్ఞుఁడై నశించును. అమాత్యుఁడు ధనవంతుఁడై నకొలఁదిని బ్రభువున కసాధ్యుఁ డగును. సంజీవకుఁడు సర్వకార్యములందును స్వేచ్ఛగ వర్తించుచున్నాఁడు. నాచెప్పిన విషయములకు మీరె సాక్షులు కాఁగలరు. పరదారధనాదులను గోరనిపురుషుఁడు లోకమున దుర్లభుఁడు. అనిన మృగరాజు "ఔరా! సంజీవకుఁడు నా రాజ్యమును గోరుచున్నవాఁడా! ఎంత ఘోరమును దలంచెను! ఆతనితోడ నాకు స్నేహము మెండు. ఎట్టి దుష్కార్యము తలంచినను సంజీవకున కొక కీడు చేతకు నా మన సొప్పదు. తనకు హాని చేయుచుండినను బ్రియుఁడు హితుఁడుగనే తోఁచును. మల మూత్ర పురీషాది దూషిత మగు శరీర మెవ్వనిది వాని కసహ్యముగఁ దోఁచుచున్నదా ?

ఉపకరణ సహితముగ గృహమును గాల్చినను నా యగ్నిపై నెవ్వనికైన ద్వేషము జనించుచున్నదా? అట్లే నాకును సంజీవకునిపై నసూయ పొడమకున్నది" అనిన దమనకుఁడు దేవా! అదియే గొప్ప ప్రమాదము. రా జెవ్వనియందుఁగాని స్థిరానురాగము గలిగి యుండరాదు. అట్టివాని సంపద యవశ్యము నశించును. శ్రుతికఠినమైనను పథ్యవాక్యము సుఖావహము. అట్టి మాటను జెప్పువాఁడును వినువాఁడును గల చోట లక్ష్మి తనకుఁ దాన వచ్చి నాట్యమాడును. కులక్రమాగతులగు ప్రధాన భృత్యులనెల్లఁ బరిత్యజించి యీ గంతుకుండగు వీని నమ్మి యుంటివి. ఇదియు ననుచిత కార్యము. అనిన మృగరాజు "ఏమి! యాశ్చర్యము. అభయమిచ్చి దగ్గఱకుఁ జేర్చి రక్షించుచుండ నాకేల యీతఁడు హాని దలంపవలయును?" అనిన దమనకుఁడు "దుర్జనుఁడు స్వాంతమున ఋజుత్వమును గాంచఁడు. తోమి మర్దించి వెదురుబద్దలు వెట్టి కట్టి చిరకాలముంచినను గుక్కతోఁక వక్రతను మానునా? వర్ధన సమ్మానములచేత ఖలులు ప్రీతులుకారు. విషవృక్షమమృతముఁ బోసి పెంచినను దియ్యని ఫలముల నీయదు గదా? ప్రభూ! నేను జెప్పెద వినుము. సంజీవకుని దోషమును సేవక ధర్మము ననుసరించి చెప్పుమనకయే చెప్పితిని. ఇఁక మీరు సంజీవకు నుపేక్షించినను నా దోషములేదు. నృపతి స్వచ్ఛందచారియై కార్యాకార్యముల గణింపక యాపదకుఁ జిక్కి పిదప తన దోషము భృత్యులదని వారిని దిట్టుచుండుట సహజము. కావున ముందుగనే వచించితిని"

అనినఁ బింగళకుండు తనలో "ఏమీ! యీతని మాట సత్యమా? ఒకని మాట విని యెవ్వనిఁగాని దండింపరాదు. స్వయముగఁ బరీక్షించి తెలిసికొనవలయును" అని చింతించి దమనకా! సంజీవకుని కేమి శిక్ష విధింపను? అని ప్రశ్నింప దమనకుఁడు ససంభ్రమంబుగ దేవా! వలదు వలదు. అపరాధమును బ్రత్యక్షముగఁ జూచునంతవఱకు నూరకుండుము. అయ్యది ప్రకటమైనపుడు మరణదండము విధింపుము. అంతియకాని తొందరపడి స్వల్పదండన మొసఁగి మరల నాతని నుద్యోగమున నిడికొనుట భయహేతువు. ఈ విషయము నిగూఢముగ నుంచవలయును. అనినఁ బింగళకుండు దమనకా! సంజీవకుండు మనకంటె బలవంతుఁడా? మనకెగ్గు చేయఁగలఁడు. అని యడుగ దమనకుం డిట్లనియె. యుద్ధము చేయక బలాబలంబు లెట్లు విశదము లగును? అదియునుం గాక శత్రు వల్పుఁడయ్యు నొకప్పుడు గొప్ప హాని చేయువలంతియై యుండును. ఒక కార్యము తటస్థమైనపుడు గాని సామర్థ్యము వెల్లడి కాదు.

ఆ॥వె. టిట్టిభం బొకండు ♦ నెట్టన సంద్రంబు
బలము సూడ నండ ♦ ముల హరింప
నతని గెలిచి మరల ♦ నయ్యావి గైకొనె
నల్పుఁడైన నొకట ♦ నధికుఁ డగును.

నీ కాకథ చెప్పెదను వినుము.

### సముద్రుఁడు — టిట్టిభము.

దక్షిణసముద్రతీరమున రెండు లకుముకిపక్షులు వాస

ము చేయుచుండెను. వానిలో నాఁడుపక్షి తనకుఁ బ్రసవ కాలము సమీపించిన భర్తతో నిట్లనియె. నాథా ! నాకు గ్రుడ్లు పెట్టుకాలము సమీపించినది. ఈ చోటు విడిచి మఱి యొక తావు చూచికొనవలయును. ఇచ్చటనే ప్రసవించినచో సమీపమగుటచే సముద్రుఁడు మన గ్రుడ్లను హరింపకమానఁడు అనిన పురుషటిట్టిభ మిట్లనియె. ఈ ప్రదేశమే సుఖకరమైనది. ఇచ్చటనే ప్రసవింపుము. సముద్రుఁడు హద్దుమీఱి నా కూఁటనున్న యండముల నేలహరించును ? హరించునుబో ! నే నూఱకుందునా ? నేనల్పుఁడని తలంపకుము. ఆతని దండించుసామర్థ్యము నాకుఁ గలదు. అనిన టిట్టిభి మగనిమాట విని తన కులాయమునను గ్రుడ్లు పెట్టెను. సముద్రుఁడు వారిసంభాషణము నాలించి యాపక్షి సామర్థ్యముఁ గననెంచి వాని యండముల నపహరించె. పిమ్మట "నాథా ! చూచితివా ? సముద్రుని యాగడము. నేను ముందె విన్నవించితిని. నీవు విననైతివి. నాదు బంగారుగ్రుడ్లు సముద్రముపాలయ్యె. ఇఁక నే నెట్లు జీవింతును ? " అని భార్య వాపోవుచుండ టిట్టిభము దాని నూఱడించి పక్షుల నెల్ల సమ్మేళనముసేసి తనకు సముద్రుడొనర్చిన యపకారము వెల్లడించి యాతనినుపేక్షించిన పక్షుల మీకును నిట్టిహాని రాఁగలదని బోధించి వానిని వెంటఁ బెట్టుకొనిపోయి పక్షిరాజగు గరుడుని సమీపించి తనవృత్తాంతము నాతనికి విన్నవించెను. గరుడుఁడు తనపరివారములో నొకఁడగు టిట్టిభున కంబుధియొనర్చిన యపరాధమునకుఁ గోపించి యా సంగతిఁ దనస్వామియగు పురుషోత్తమునకు

నివేదింప భక్తపరాధీనుఁడగు వాసుదేవుండు టిట్టిభాండములనిచ్చివేయుమని సముద్రుని శాసించె. ఆదేవదేవుని యాజ్ఞకు బద్ధుఁడై సముద్రుఁడు లకుముకి పక్షిగ్రుడ్లను భద్రముగఁ దెచ్చి దాని కిచ్చివైచె. కావున "ఒక కార్యము తటస్థించినపుడుగాని బలాబలములు తెల్లముకావు." అని నుడివితినని పింగళకుండు దమనకా! ఈతని ద్రోహబుద్ధి మన కెట్లు వెల్లడియగును. అది మనకెపుడు తెలియును. అనియడిగిన దమనకుం డిట్లనియె.

దేవా! అయ్యది వాని యాకారముచేతనే గ్రహింపవలయును. సంజీవకుఁడు తన సోగ కొమ్ముల నొడ్డి తలవంచి బుసగొట్టుచు నీ కభిముఖుఁడై వచ్చును. అదియే వాని యుద్ధారంభమని గ్రహింపుము. అనిచెప్పి పింగళకుని యొద్ద సెలవుగైకొని నెమ్మది నెమ్మదిగ బెదురుచూపులు చూచుచు సంజీవకుని చెంతకేగెను. సంజీవకుఁ డాతనిఁ గాంచి దమనకా! కుశలమా? యనిన దమనకుండు రాజసేవకులకును గుశలమునకును జాలదూరము. భృత్యుని జీవనము పరాధీనము. మనసునకుఁ గుదురు సున్న. ప్రాణమునకుఁగూడ స్థైర్యముండదు. "లోకమున ధనముగలిగిన గర్వింపనివాఁడును, ఎపుడును గష్టము లెఱుంగనివాఁడును, భార్యచేఁ దిరస్కరింపఁబడనివాఁడును, రాజునకుఁ బ్రియుండును, యమునిచేతఁ జిక్కనివాఁడును, గౌరవమునొందిన యాచకుఁడును, దుర్జనుల వలకుఁ జిక్కి క్షేమముఁ గాంచిన మనుజుఁడును లేడని యనుభవశాలులగు పెద్దలు వచింతురు. అనిన సంజీవకుండు

మిత్రుఁడా! ఏమిది? నీమాటలు నాకర్థమగుట లేదు. విశదముగఁ జెప్పుమనిన దమనకుఁడు దైవహతకుఁడనగు నే నిపుడేమని వచింతును? మహాసముద్రమధ్యమున మునుంగుచున్న వాఁడు సర్పసహితమగు నౌకఁ బ్రమాను సమీపించిన దానిని బట్టుకొనుటకును విడుచుటకును దోఁచక తొట్రిలునట్లు తల్లడిలుచున్నాఁడను. ఒకవంక రాజభయము. వేఱొకతట్టు మిత్రునికి రానున్న యాపదయు నామానసమును బీడించుచున్నవి. ఈ దుఃఖసాగర పతితుఁడనగు నే నెటకేగను? ఏమి సేయను? అని యొక వేడినిట్టూర్పుఁ బుచ్చెను. సంజీవకుఁడాతని యాకారమును భాషితమును గని వ్యాకుల హృదయుఁడై మిత్రమా! నీ మనోగతమును వెలువక నుడువుము. అని యడిగిన దమనకుఁడు సంజీవకుని చెవియొద్దఁ జేరి యిట్లనియె. ఈకార్యము వెల్లడించుట రాజద్రోహము కావున నీకుఁ జెప్పరాదు. ఐనను నీవు మమ్ములను నమ్మి వచ్చినవాఁడవు కావునఁ బరలోకముకొఱకు నీక్షేమమును మేము విచారించుచుండవలయును. కావున చెప్పెద వినుము. మనరాజు నీపై మిగుల ద్వేషముతో నున్నవాఁడు. సంజీవకుని జంపి వానిమాంసముతోఁ బరివారమున కెల్ల విందు చేసెదనని నాతో రహస్యముగాఁ జెప్పినాఁడు. నీవు కాలానుగుణముగ నడచికొనుము. ఈ రహస్యమును వెలువరింపకుము. అనిన సంజీవకుఁడు భీతుఁడై తనలో "లక్ష్మి నీచు నాశ్రయించుటయు, సరస్వతి కులహీను నొందుటయు, యువతి యపాత్రుని వరించుటయు, పర్వత సముద్రాదులందు పర్జన్యుఁ డధికముగ వర్షించుటయుఁ, గాంచుచున్నారము.

అట్లే రాజులు నపాత్రులనే పోషింతురుగాని సజ్జనుల కృప యోగపడరు. నాపై రాజున కెవ్వరైనఁ గొండెములు సెప్పి యుందురా? లేక యాతనికే యీదుర్బుద్ధి జనించినదా? నిశ్చ యింప వీలు లేకున్నది.'' అని తలంచి దమనకునితో "బహువిధ ముల నేను సేవ చేయుచుండగా రా జనుగ్రహశూన్యుఁడై నాకుఁ గీడు దలంచుచుండెనా? ఇఁక వీని ననునయింపఁ దర ముకాదు. ఒక కారణమునఁ గోపించిన నది చక్కఁజేసి వాని కోపముఁ దీర్పవచ్చును. కాని యకారణ ద్వేషి ద్వేషమును మాన్ప వెరవులేదు. నే నేమి యపకారము చేసితిని నన్నేల యకారణము వధింపవలయును. అధికారమదాంధులగు ధన గర్వితుల విలాసము లియ్యవి!'' అనిన దమనకుఁడు సంజీవకా! ఒక్కఁ డొక రుపకారము చేయుచుండిన నయ్యది యపకారముగ దోఁచును. ప్రత్యక్షమున నపకారముచేసినను నొక్కొక్కని యందు దయగలిగి యుందురు. ఇయ్యది చపలచిత్తుల లక్ష ణము. దుర్జనులకుఁ జేసిన యుపకారశతము, నవశుఁడగు భృత్యునకుఁ జేసిన యాజ్ఞాశతము, బుద్ధిహీనునకుఁ జేసిన యుప దేశ శతము నిష్ఫలము. ఎంత సుఖమున్నచోట నంతదుఃఖ ముండును. చూడుము! మనోహరమగు చందనభూరుహము నకుఁ గ్రూరతరములగు నాగుల యాటంకము. సురుచిరము లగు కమలములకు గ్రాహసహితమగు హ్రదమధ్యమున నివాస ము. ఈయర్థమును గ్రహించి మతిమంతుఁడు సుఖములు దుఃఖ పర్యవసితము లనని తలంపవలయును. మనరాజు కపటనాటకా భిజ్ఞుఁడని నేఁటికి విశదమయ్యెనుగదా? ఏమియాదరము! ఏమి

యాలింగనములు! ఏమిమందహాసములు! ఏమిసల్లాపములు! ఏమియర్ధాసన దానములు! ఈమాయాన్యై పుణ్యు మెచ్చట నేర్చెనో! గాఢాంధకారమును బాపుటకు దీపము గలదుగాని మూర్ఖుని యజ్ఞానాంధకారమును దొలఁగింపఁ గోటిసూర్యు లయినఁ జాలరు. అనిన సంజీవకుండు "ఎంతకష్ట మెంతకష్టము! గడ్డిఁదిని బ్రదుకుపసరము నా! సింహము చంపవలసినది? బలవంతులకు బలవంతులతో వివాదము శోభించునుగాని యసమానుల కయ్యములు దర్శనీయములు కావు. ఎవ్వఁడో నాపై రాజునకుఁ గోపముఁ గలిగించినాఁడు విఱిగిన మనసిఁక నతుకఁబడదు. రాజవైరము వజ్రము భయావహములు. ఐనను సంగ్రామమునఁ బడి మరణించుటయే నాకు మేలుగాని దీనుఁడనై యాతని బతిమాలుట యుక్తము కాదు. యుద్ధమునఁ జచ్చినవాఁడు స్వర్గ్లోకము నొందును. గెలిచెనేని నిహలోకసుఖములఁ గాంచును. యుద్ధము చేయకుండినను నాకుఁ జావు తప్పదు. సమరమునకేగిన నయ్యాది సంశయము. దమనకా! రాజు నన్నుఁ జంపదలంచుసమయము నెట్లెఱుంగనగును? అనిన జంబుకుండిట్లనియె. సంజీవకా! పింగళకుం డెపుడు చెవులు నిక్కించి తోఁక ద్రిప్పుచుఁ జేయి పైకెత్తి నోరుఁదెఱచి నీవైపు చూచుచుండునో యయ్యదియే నిన్ను మడియించు సమయము. అట్టిసమయమున నీవే ముందుగ విక్రమించి జయము నొందుము. ఇది యంతయు గుప్తముగ నుండనిమ్ము. లేకున్న మనయిరువుర ప్రాణములు కూడ మనవి కావు. అని చెప్పి దమనకుఁడు కరటకుని సమీపమున కేగెను.

కరటకుఁడు దూరమున నాతనిఁ గాంచి "పండా? కాయా?" అనెను. దమనకుఁడు మందహాసము చేయుచు "పండే యయ్యెను. ఇంతవఱకు వారి హృదయ పంకము లందు భేద భీజములను నాటితిని. నాదు బుద్ధిచాతుర్యమున దోహదముచేసి యచిరకాలంబున వాని మహావృక్షములుగ నొనర్చితిని. ఇఁక నవి తప్పక ఫలించును. సంజీవకునిఁ బింగళ కుఁడు చంపి తీఱును" అనెను. ఈ మాట వినినతోడనే కరటకునకు సంజీవకునిపై నొక విధమగు జాలి కలిగెను. అట్టి మరణశిక్ష విధింపించుట కాతని కిష్టములేదు. సంజీవ కునిఁ బింగళకుఁ డుద్యోగమునుండి తొలఁగించిన నాతనికిఁ జాలును. దమనకు డింత కార్యము చేయునని యాతఁ డెఱుఁ గఁడు. ఆతనిముఖవికాసమును మనోభావమునుగూడ తక్షణము మాఱిపోయినవి. తక్షణ మాతఁడు దమనకా! యెంతపనిచేసి తివి? దుష్టులకు బంధువును, యాచించినఁ గోపింపనివారును, ధనమునకుఁ దృప్తినొందువారును, చెడుపనులు చేతఁగాని వారును లోకమున నుండరు. ధూర్తులు తమ లాభమునకై ధనవంతుని దుర్వృత్తునిఁజేయుదురు. నీవు ఖలుఁడవు. సంజీవ కుఁడు కుడుము చేతికిచ్చినఁ బండుగని తలంచువాఁడు. అమాయ కుఁడు. ఎల్లరను నమ్ముటయేకాని వీఁడు దుష్టుఁడు వీఁడు శాంతుఁడు నని యెఱుంగఁడు. అట్టి నిరపరాధికిఁ దగనిహానిఁ గలిగించుచున్నాఁడవు. నీతో నేకీభవించుటంబట్టి నేనును గొంత పాపభాగి నైతిని. నాదుపాపమును దేవుఁడు శమింపఁ జేయుఁగాత! అని తనయసమ్మతిని దెలుపుచు నించుక

దూషింప నాతనిమాటలు సరకుగొనక దమనకుఁడు దిగ్గున లేచి పింగళకుని సమీపమున కేగె.

పింగళకుఁడు దమనకా? వచ్చితివా! విశేషము లేమి? అనిన దమనకుఁడు "దేవా! ఇదే సంజీవకుఁడు యుద్ధసన్నద్ధుఁడై వచ్చుచున్నాఁడు. నీవును సమరసంసిద్ధుఁడవై యుండుము" అని సంజీవకునితో మున్ను తాఁ జెప్పినచొప్పునం గూర్చుండఁ బెట్టె. అంత సంజీవకుండే తెంచి తేని యాకారమును వీక్షించి తనను జంప నుంకించుచున్నాఁడని తలంచి కొమ్ములొడ్డి బుస గొట్టుచు నాతని నెదిరించె. సంజీవకుఁడు తనను పొడువవచ్చు చుండెనని తలంచి పింగళకుఁడు పర్వతగుహలు బద్దలగునట్లు గర్జించి సంజీవకునిపై కుటికెను. సంజీవకుఁ డాతని నఖఘాతములను సరకుసేయక వెనుకకుఁ దిరిగి యెడమకాలితో నొక్క తన్ను దన్నెను. ఆ తన్నుదిని సింగము తలక్రిందుగఁ బడి యొడలు దులిపికొని లేచి ద్విగుణీభూత క్రోధముతోఁ గ్రకచ దంతకఠోరంబులగు తనకోఱలతో సంజీవకుని కంఠంబుఁ గబళించిపట్టి కఱచెను. సంజీవకుండును యమదండ సదృశములగు తన విషాణముల సాహాయ్యమున నాతనితోడ భీషణముగఁ గొంతవఱకుఁ బోరెను. ఎంత బలముగలదైనను వృషభము సింగముతోఁ బోరి గెలువఁ గలదా! కడకుఁ బింగళకుని చేతిలో సంజీవకుఁడు ప్రాణములు వీడెను. పిమ్మటఁ బింగళకుఁడు సింహాసనమునఁ గూరుచుండి హతుఁడైన సంజీవకునిఁ జూచి జాలినొంది "ఆహా! ఎంత దారుణకార్య మొనర్చితిని! ఒక్కనాఁటితప్పునకై చిరమిత్రుఁ

డగు సంజీవకుని క్షణకాలములోఁ జేతులార వధించితినే! పాపము మాత్రము రా జనుభవించును. రాజ్యఫల మితరులు గుడుతురు. ఈతఁడెన్నఁడును నామాట కెదురాడి యెఱుంగఁడు. కడు సాధువు. తుద కీదుర్బుద్ధి యేల జనించెనో? ఎవ్వారో క్రూరులగువారి దుర్బోధనలచే నిట్లు నాపై డీకొనియుండును. నేనయిన సర్బోధనలఁ జక్కఁజేయక యనాలోచితమతినై మిత్రునిఁ జంపికొంటిని. నాయట్టి దుర్బుద్ధి యీజగమున నుండఁడు" అనుచుఁ బలువిధములఁ బశ్చాత్తాపము నొందు చుండె.

అంత దమనకుండు చెంతఁజేరి రాజా! శత్రునివధించి పశ్చాత్తాప పడియెద వేల? తనప్రాణములకు హానిదలంచిన పితృభ్రాతృ పుత్రాదులను సహితము నిర్దయుండై వధించుట రాజధర్మము. ధర్మార్థకామములను గుర్తెఱింగినవాఁడు కేవలము దయాపరుఁడై యుండరాదు. అతిశాంతుఁడగు వాఁడు చేతనున్న యన్నమును సహితము భక్షింపఁజాలఁడు. సర్వత్ర శాంతము గలిగి యుండుట సన్యాసులకుఁ జెల్లును గాని రాజులకుఁ జెల్లదు. రాజ్యలోభమునఁ గాని, యహంకారమునఁ గాని స్వామిపదమును గోరువారికిఁ బ్రాణముఁ దీయుట కంటె వేఱుశిక్ష లేదు. స్వాధీన గాని భార్యను, ఎదిరించు భృత్యుని, ప్రమాదియగు నుద్యోగిని బహిష్కరింపవలయు నని బుద్ధిమంతులు వచింతురు. రాజనీతి బహు భంగులైనది. సత్య రూపమగు ననృతము వచింప వలయును. అంతఃపారుష్యము గలిగి ప్రియోక్తు లాడవలయును. హింసకుఁడయ్యు

దయాళువువలెం గానంబడవలయును. అర్థపరుండయ్యు దాత యట్లు వర్తింపవలయును. నిత్యము వ్యయము సేయునట్లుండి ధనాకర్షణము చేయవలయును. రాజా ! ఇట్టి యర్థములు సర్వజ్ఞులరగు మీకు నేను వచింపవలయునే ? శత్రుసంహారమునకు వగవకుండు. అని యాఅడించుటయుం బింగళకుండు నిర్విచారుండై యుండెను.

దమనకుండు సంతుష్టుండై మిత్రులతోంగూడి రాజునకిష్టుండై యుండె.

అని చెప్పి విష్ణుశర్మ బాలకులారా ! సుహృద్భేదమును వింటిరా ? యనిన రాజకుమారులు "ఆర్యా ! భవదనుగ్రహంబున నంతయు వింటిమి. బహువిధములగు నీతులం దెలిసితిమి. దుర్జనుల స్వభావము, సజ్జనుల యోగ్యత, ప్రభువుల యవివేకము, సేవకుల ధర్మములు సర్వంబు తెల్లంబయ్యె. మా మానసములు వికాసము నొందినవి. మేము ధన్యులమైతిమి. అని చెప్పిన విష్ణుశర్మ యిట్లనియె. ఓ విద్యార్థులారా ! యీ సుహృద్భేదమును మీ శత్రువులయెడ నుపయోగపడనిండు. ఖలులెల్లరు దమంతటం దామె క్రమముగ నాశమయ్యెదరు గాత ! సజ్జనులు సర్వసంపదల నొందెదరుగాత ! ఈ మనోహరమగు కథను వినువారెల్లరు నానందపరవశు లయ్యెదరు గాత !

సుహృద్భేదము సంపూర్ణము.

The Kesari Printing Works, Madras.